సంపుటి 8, సంచిక 7

# సోవియట్ భూమి

ఏప్రిల్ 10, 1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖచే తెలుగు, హిందీ, ఉర్దూ, బెంగాలీ, తమిళం, మలయాళం, పంజాబీ, మరాఠీ, ఒరియా, ఇంగ్లీషు భాషలలో ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



# కల నిజమైంది

వాలెన్‌తిన్ కుజ్మెంకో

సోవియట్ తుర్క్‌మేనియాకు చెందిన వ్యవసాయక కార్మికుల జట్టు కొకదానికి సోవియట్ ప్రభుత్వం బిరుదులను ఇచ్చినదని ఈ మధ్య నేను పత్రికల్లో చదివాను. వారిలో నాకు పరిచయస్థుడైన, ఇగ్రి-గుజర్ గ్రామనివాసి బైరామ్ కాకయేవ్ వున్నాడు. అతడు ట్రాక్టర్ డ్రైవర్. అతని ఉత్తమ కృషికి మెచ్చి ప్రభుత్వం సామ్యవాద శ్రమవీర బిరుదాన్ని ఇచ్చింది.

నా మిత్రునికి బిరుదు లభించినందుకు నా హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది.

....ఒకనాటి సాయంత్రం, మేము కాకయేవ్ ఇంట్లో రంగు రంగుల కంబళిపైన కూర్చొని, సువాసనతో కూడిన ఆకుపచ్చ తేనీటిని త్రాగుతూ, బైరామ్ తాను యేవిధంగా ట్రాక్టర్ డ్రైవర్ అయినదీ చెటుతుంటే వింటూ కూర్చున్నాము.

అతడు అప్పటి విషయాలను గుర్తుకు తెచ్చుకొంటూ చెప్ప సాగాడు. ఇగ్రి-గజర్ గ్రామంలో, 1932లో మొట్టమొదటి సారిగా ఒక పెద్ద నాగలిని ఈడ్చుకొంటూ ట్రాక్టర్ పత్తిపొలాల్లకి వచ్చింది. గ్రామస్థుల గుంపు ఒకటి దానివెంట బయలుదేరారు. అది దున్నుతూ వుంటే వాళ్ళంతా ఆశ్చర్యంగా చూడసాగారు. దున్నిన మట్టి పెళ్ళలను చేతిలోకి తీసుకొని, వాటిని నలిపి, ఆ మట్టిని పరిశీలించారు.

అలా అప్పుడు ఆశ్చర్యంగా చూచినవారిలో పదమూడు సంవత్సరాల బైరమ్ కూడా ఉన్నాడు. ఆ నాడు తమ సంచార గుడారంలో పడుకొన్న బైరమ్‌కు చాలాసేపు నిద్రపట్టలేదు: పెద్దవాడైన తర్వాత తాను యేవిధంగా ట్రాక్టర్ డ్రైవర్‌ను కాగలనా అని ఆలోచించ సాగాడు!

"చివరికి అలాగే ట్రాక్టర్ డ్రైవర్నయ్యాను," అన్నాడు బైరమ్.

బైరమ్ ఆ రోజు సాయంత్రం మాకు ఇంకా అనేక విషయాలు చెప్పాడు. తాను యే విధంగా వివాహం చేసుకొన్నదీ, ఇల్లు కట్టుకొన్నది, పండ్లతోటను నాటినదీ చెప్పాడు. ఇప్పుడతనికి ఐదుగురు బిడ్డలు, పెద్దకొడుకు రజెప్‌కు ఒక మోటారు సైకిలు, తనకు "జిమ్" అనే కారు కొన్నాడు.



సామ్యవాద శ్రమవీరుడు బైరామ్ కాకయేవ్, రెండవ మేరీ మెషిన్, ట్రాక్టర్ స్టేషన్ డ్రైవరు, అతని కొడుకు రజెప్



సమష్టిక్షేత్ర రైతులు. సర్వ సభ్య సమావేశ ప్రారంభానికి బాగాపూర్వమే ఇండ్లు విడిచి స్థానిక సంస్కృతీ మందిరానికి వెళ్ళారు



వారిలో. బోరిసోవో గ్రామంలోని సమిష్టి క్షేత్రానికి వ్యవస్థాపకులలో ఒకరు. 80 సంవత్సరాల నటాలియ మజయేవా

# ఇష్టాగోష్ఠి

## ఎస్. కుజెనెత్సోవ్

Gత సంవత్సరం, ఆకురాలు కాలంలో వ్యవసాయ మంత్రి శ్రీ దేశముఖ్ నాయకత్వాన. భారతీయ సహకార సభ్యుల ప్రతినిధివర్గం సందర్శించిన, మాస్కో మండలంలోని ఈ లెనిన్ సమిష్టిక్షేత్రం. వ్యవసాయ శాఖలు అనేకంగా వున్న బృహత్సంస్థ.

దీనికి విశాలమైన హాట్ హౌసెస్. హాట్ బెడ్స్, మాస్కోవ్వనదీ వరద భూములలో ట్రాక్టర్లు, యంత్రాలతో సేద్యం చేయబడే కాయగూరల పొలాలు, రమారమి 500 ఆవుల పెంపకానికి అనువైన నవీన వ్యవస్థలున్న ఇటుకతో కట్టిన భవనాలు వున్నాయి. ఈ బృహత్సంస్థయొక్క ఆదాయం, కొన్ని మిలియన్ల రూబుల్లు దాటింది.

సమిష్టి క్షేత్రపు బోర్డుకు, సంవత్సరం తర్వాత సంవత్సరానికి జరిగే సర్వసభ్య సమావేశం, తమ సభ్యులనుండి ఒకర్ని అధ్యక్షునిగా ఎన్నుకుంటుంది. బోర్డు సభ్యుల నివేదిక, సర్వసభ్య సమావేశానికి సమర్పించబడడం ఏడాదికొకసారి జరిగే ప్రధాన సంఘటన.

మా విలేఖరి ఒకసారి యిటువంటి ఒక సమావేశానికి, 1956వ సంవత్సరకృషిని రైతులు సమీక్షిస్తున్నదానికి వెళ్ళి, యీ దిగువ వ్యాసంలో వివరించారు.



సమావేశ మందిరంలో అధ్యక్ష వేదికముందున్న బలమీద లేత ఎరుపు గుడ్డపరచి, మైక్రోఫోను పెట్టేశారు. సమిష్టిక్షేత్ర రైతులందరూ సమావేశమవు తుండగా, స్థానిక చిత్రకారులు బలచుట్టూ గుంపుగా మూగి పొడవాటి కాయితంమీద డ్రాయింగులు వేస్తున్నారు, ఆ తర్వాత మ్యాజిక్ లాంతరు ద్వారా ప్రదర్శించను. ఈ చిత్రాలు తెరకెక్కినప్పుడు, బాగా పరిచితులైన వ్యక్తులు, ఎంతో పెద్దగా. రకరకాల పోజులలో కనిపించగానే హాలంతా కడుపుబ్బిపొయ్యేటంత నవ్వులతో నిండిపోతుందని వాళ్ళు ఊహిస్తున్నారు



పొరుగునవున్న వ్లాదిమీర్ ఇల్యిచ్ సమిష్టిక్షేత్ర ప్రతినిధులు వచ్చారు. లెనిన్ సమిష్టిక్షేత్ర వ్యవసాయ అర్థికవేత్త తాత్యానా పెస్కోవా ముఖ కవళిక లనుబట్టి, సమిష్టిక్షేత్ర విజయాల గురించి, ఆ సంవత్సరం సభ్యులు బాగా పనిచేసిన దానిని గురించి అతిధులకు చెబుతున్నదని తోస్తుంది. అయితే, వ్లాదిమీర్ ఇల్యిచ్ క్షేత్ర ప్రతినిధులకు ఆ ఫలితాలు అంతగా నచ్చినట్టు లేవు. వదంతులనుబట్టి, వాళ్ళు సాధించింది అంత స్వల్పం కాదని తెలుస్తున్నది. పొరుగునవున్న క్షేత్రానికన్నా లెనిన్ క్షేత్రానికి దున్నదగిన విశాలమైన భూములు ఎన్నో ఉన్నప్పటికీ, రెండింటి ఆదాయం యించు మించు ఒకటే.

మరి ఆ అతిథులు సమావేశంలో ఏం చెబుతారో ?

సమావేశం ఇంక కొన్ని నిముషాలలో ప్రారంభం కానున్నది. లెనిన్ సమిష్టి క్షేత్రాధ్యక్షుడు మిత్రోఫాన్ జఖరోవ్, అకౌంటెంటు. పొలైనా దొమ్రినా మరొకసారి తమ లెఖ్ఖల్ని పరిశీలించాలని నిర్ణయించుకొన్నాడు →



## లెనిన్ సమిష్టి క్షేత్ర అంశ, అంక వివరణ

"1956 లో, సమిష్టిక్షేత్రపు కాయగూరల సగటు పంట ముందరి సంవత్సరంకన్నా 50 ప్రతిశతి అధికంగా వుంది, బంగాళా దుంపలు ముందరి సంవత్సరానికన్న రెండింతలు వచ్చాయి. కాయగూరలు,బంగాళా దుంపలు మాత్రమే సమిష్టి క్షేత్రానికి సుమారు 3 మిలియన్ల రూబుళ్ళ ఆదాయాన్నిచ్చాయి. దీనికి, పశు పెంపకంవల్ల వచ్చిన 2 న్నర మిలియన్ల రూబుళ్లు, ఉద్యాన కృషిమీద వచ్చిన అర మిలియన్ కలిపినట్టయితే మొత్తం ఆదాయము ఆరు మిలియన్ల రూబుళ్లు పై బడింది, ప్రధాన పంటలను 50నుండి 100 ప్రతిశతికి పెంచి, సమిష్టిక్షేత్ర రైతులు తమ ఆదాయాన్ని 1956 కన్నా ఇంచుమించుగా ద్విగుణీకృతం చేయడంలో కృతకృత్యులయ్యారు. హాట్ హౌస్ ఫర్నెస్ అటెన్‌డెన్ట్ అలెగ్జీ పెస్కోవ్, ఆయన కుటుంబం డబ్బు రూపంగా, పంట రూపంగా 35,000 రూబుళ్ళను పొందారు, ఇది 1955 లో వారికి వచ్చినదానికన్న 15,000 రూబుళ్ళు అధికమన్నమాట. ఆయన కుటుంబం 40,000 రూబుళ్లు ఆర్జించారు." (బోర్డు నివేదిక నుండి).

# బోర్డు నివేదిక



క్రితం దినం, సమిష్టిక్షేత్రపు బోర్డు నివేదికపై సమగ్ర చర్చ జరిగింది




"సమిష్టి క్షేత్రందగ్గర 1956 లో కట్టిన గ్యారేజిలో, 18 బండ్లను పెట్టవచ్చు. సమిష్టి క్షేత్రపు కార్లను, రానున్న కొద్ది సంవత్సరాలలో 25 దాకా పెట్టడానికి వీలుగా ఈ గ్యారేజి నిర్మాణమైంది." (బోర్డు నివేదిక నుండి)

## బోర్డు నివేదికనుండి అంశ, అంక వివరణ

1956లో సమిష్టి క్షేత్రపు 80 కుటుంబాలు.

కొత్త యిళ్ళను కట్టుకొన్నారు.

ఛాయా చిత్రంలో: పశుపాలకురాలు యన్. గ్నిలోవా. కేబులుదారిగుండా మేత వేస్తోంది

"నీటి పంపులు వేయబడ్డాయి. పశుగ్రాసశాల యంత్రీకరణం చేయబడింది. పాలు పితకను విద్యుత్ వ్యవస్థ ప్రవేశ పెట్టబడింది. అవరణ పరిశుభ్ర పరచను, పశుగ్రాసాన్ని తీసుకపోను సౌలభ్యంగా పశుపోషకురాండ్రకు పని తేలిక చెయ్యను కేబుల్-వే వేయబడింది." (బోర్డు నివేదికనుండి) ↓





"లెనిన సమిష్టిక్షేత్రపు యాంత్రికీకరణ, విద్యుద్దీకరణ వ్యవస్థలన్నీ మా క్షేత్రపు ఎలక్ట్రీషియన్లు, ఫిట్టర్లు, టర్నర్లు, మెకానిక్కులే నిర్వహిస్తున్నారు. 1956 లో, సమిష్టిక్షేత్రం, అవసరమైన పరికరాల కలిగివున్న ప్రత్యేక య ం త్ర శా ల ను నిర్మించింది." (బోర్డు నివేదిక నుండి)

ఛాయా చిత్రంలో: మైఖేల్ సిదోరోవ్, లేత్ దగ్గరవున్న సమిష్టి క్షేత్రపు టర్నర్.



"బోరిసోవో గ్రామస్తులకు రోజూ వార్తాపత్రికలు 315 వస్తాయి. ఆ గ్రామపు పోస్టుమన్ నికితాలిప్తోవ్. గ్రామంలో ఎక్కువగా గౌరవించబడే వాళ్లలో ఒకడు. 25 సంవత్సరాలకు పైబడిన ఆయన సేవలను పరిగణిస్తూ, సమిష్టిక్షేత్ర సంస్కృతీ భవనంలో ఒక ప్రత్యేక సమావేశం జరుపబడింది". (బోర్డు నివేదికనుండి)

ఛాయాచిత్రంలో: నికితాలిప్తోవ్ టపాతో.

సమిష్టి క్షేత్ర ఆదాయపు పెరుగుదల

1952—2,399,267 రూబుల్లు
1953—3,631,611 ,,
1954—4,471,000 ,,
1955—5,680,543 ,,
1956—6,228,611 ,,

# సమావేశంలో అభిప్రాయాలు






చిత్రంలోని వుపన్యాసకురాలు రైసా కపుస్తీనా, సమిష్టిక్షేత్ర ఆడిటింగ్ కమిషన్ సభ్యురాలు. సమిష్టి క్షేత్ర రైతులచే ఈ కమిషన్—బోర్డు కార్యకలాపాల పర్యవేక్షించేందుకు, గోదాములు. లెక్కలు సక్రమంగా వుండేటట్టు చూచుటకు, సభ్యులకు ఆదాయం సక్రమంగా పంపిణీ చేయబడేట్టు చూచేటందుకు ఎన్నుకోబడింది.

సమావేశానికి పూర్వమే, సమిష్టిక్షేత్ర విషయాలన్నింటినీ ఆడిటింగ్ కమిషన్ సమగ్రంగా పరిశీలించింది. బోర్డు నివేదికతోపాటు ఆ కమిషన్ సమగ్ర నివేదిక సమర్పించబడింద.

సమావేశ దృశ్యం





"నిరుడు మనం బాగా పని చేశామా, లేదా ?" అని ప్రశ్నించింది సభను పాడి పరిశ్రమ విభాగాధికారిణి అలెగ్జేవా. "బహుశా, కొందరు మనం బాగా పని చేశామనవచ్చు. నేనంటాను మనం ఇంతకన్నా బాగా పనిచేయగలిగే వాళ్ళమని ; ఇంతకంటే ఎంతో బాగా ; మొక్కజొన్న తీసుకోండి, చొప్ప, దుంపలూ. ఆవులకు అవి తగినంతగా వున్నాయి. కాని ఎండుగడ్డి అదనంగా ఖరీదు చేయవలసి వుంటుంది.

"అందుకనే నే నడుగుతున్నాను : మనకు కావలసిన వెచ్, లుసెరెన్, ట్యాపైన్ గడ్డి మనం నాటుకోలేమా అని. పరిమితమైన గడ్డి పెంపకాన్ని ద్విగుణీకృతం చేసి, తత్ఫలితంగా లక్షలాది రూబుళ్ళను మన సమిష్టి క్షేత్రానికి మిగుల్చుకోలేమా ?"

## బోర్డు నివేదికనుండి అంశ, అంక వివరణ

లెనిన్ సమిష్టి క్షేత్ర సభ్యులలో యిద్దరికి సామ్యవాద శ్రమవీరులు, ఆరుగురికి ఆర్డర్ ఆఫ్ లెనిన్ యివ్వబడింది. మరి పదకొండు మందికి ఇతర బిరుదులూ, పతకాలు వారి శ్రమ విజయాలకు యివ్వబడ్డాయి.



"క్లావ్‌దియా అలెగ్జేవాతో నేను ఏకీభవిస్తున్నాను," అన్నది కాయగూరల సేద్య దళాధిపతి అలెగ్జాండ్రా కరేవా. "మనం ఎంతో బాగా ప్రయత్నించాం, తగ్గట్టు ఫలితాలూ బాగుండాల్సింది. ఉదాహరణకు, కాబేజీని తీసుకోండి, మనకు మంచిపంట వచ్చింది. మన అశ్రద్ధ మూలంగా కొంత, అకురాలు కాలంలో మంచు దెబ్బతింది. మనకు ఈ నష్టం కలగడానికి కారణం, మన సమిష్టి క్షేత్రానికి నిలవ చేసుకోను వసతి లేకపోవడమే. మనం ఈ స్థలాభావంచేత కాయగూరలు కోత కాగానే అమ్మివెయ్యవలసి వచ్చింది. ఒక గోదాం కట్టను ఎంతో ఖర్చుకాదు, అది లేకపోవడంవల్ల ఎంతో నష్టపడుతున్నాం."

## బోర్డు నివేదికనుండి అంశ, అంక వివరణ

1954-55 లో 78 మంది కొత్తసభ్యులు లెనిన్ సమిష్టి క్షేత్రంలో చేర్చుకోబడ్డారు. 1956 లో మరి 56 మంది చేరారు.

1956 కల్లా బోరిసోవో గ్రామంలో నిరక్షరాస్యుడండూ ఒక్కడూ లేడు.



నటాలియా క్రీజోవా, సాధారణ సభ్యురాండ్రలలో ఒకర్తె, క్షేత్రావ్యవహణ్ని ఈవిధంగా ప్రశ్నించింది :—

"కాయగూరలకు, విత్తనాలకు ఏటేటా ఎంత మొత్తం ఖర్చు చెయ్యబడుతున్నది."

"100,000 రూబుళ్ళకు పైగా."

"100,000 రూబుళ్ళే ; నే నడుగుతాను, మనం ఈ విత్తనాల్ని కట్టుకోలేమా ?" అని.

## బోర్డు నివేదికనుండి అంశ, అంక వివరణ

లెనిన్ సమిష్టిక్షేత్ర సభ్యులు 6 గ్రామాల్లో నివసిస్తారు. 400 మందికి స్థలంవున్న సంస్కృతీ భవనం ఒకటీ, 250 మందికి స్థలం వున్న హాలు గలిగిన ఒక క్లబ్బూ, రెండు పౌర పఠనాలయాలు, 4 సినిమా ప్రొజెక్షన్ యూనిట్లూ, ఒక గ్రంథాలయమూ వీరికి వున్నాయి.

లెనిన్ సమిష్టిక్షేత్రం రేడియోల సంఖ్య 1954 లోని 353 నుంచి 662 వరకూ పెరిగింది. 1957 ప్రారంభానికి దాదాపు రెట్టింపైనాయి. ఈ కాలంలో టెలివిషన్ సెట్లు 109నుంచి 513 వరకూ—దాదాపు అయిదింతలు పెరిగాయి. సమిష్టిక్షేత్ర కర్షక గృహాలు 932 వున్నాయి, అంటే ప్రతి మూడు కుటుంబాలకు రెండు రేడియోసెట్లు, మిగతా ఇంటికి ఒక టెలివిజన్ సెట్టు అమరికై వున్నవన్నమాట.



సమావేశం పరిసమాప్తమైంది. కొంత విరామానంతరం, సమిష్టిక్షేత్ర రైతులకు వలో నివేదిక సమర్పించబడింది, సంస్కృతీ భవన ఎమెచ్యూర్ కళా బృందం చేత.
ప్రేక్షకులు సమిష్టిక్షేత్ర యువ కర్షకులు ప్రదర్శించిన చక్కని ఉక్రేనియన్ నృత్యాన్ని మహోత్సుకతతో సందర్శించారు.

లెనిన్ సమిష్టిక్షేత్ర సంస్కృతీ భవనంలో సమావేశం గంటల తరబడి సాగింది. అత్యంత శ్రద్ధాసక్తులతో సమిష్టిక్షేత్ర రైతులు బోర్డు కృషిని, తమ కృషి ఫలితాలను నిశితంగా పరిశీలించారు. సమిష్టిక్షేత్ర వ్యవహరణ పట్ల గాఢమైన ఆసక్తి ప్రసంగాలన్నింట్లో ప్రస్ఫుటంగా వ్యక్తమైంది. సమిష్టిక్షేత్రాన్ని అత్యంత సమర్ధనీయంగాను, ఎక్కువ ఆదాయాన్ని రాబట్టడానికి వీలుగాను నడపాలన్నది సమావేశంలో పాల్గొన్న వారందరి ఏకైకాభిలాష.

"ఒకప్పుడు బోరిసోవో గ్రామం ఒక్కటీ, ఈనాడు, మన జిల్లా అంతా కలిపి పండిస్తున్నంత స్ట్రాబెర్రీలు పండించేది. ఎందుకు మనం లాభదాయకమైన ఈ పంట విషయంలో నిర్లక్ష్యం చేస్తున్నాం?" అని ఒక ఉపన్యాసకుడు బోర్డు సభ్యులను తీవ్రంగా ప్రశ్నించాడు.

"మనకు విశాలమైన హాట్ హౌస్ ఏర్పాట్లు వున్నవని అందరూ యెరుగుదురు. మరి త్వరగా పంటకొచ్చే కాయగూరల్ని ఇప్పుడు పండిస్తున్నంతకన్నా రెండు లేక మూడురెట్లు పండించడానికి ఆటంకం ఏమిటి?"

"సమిష్టిక్షేత్రపు సగటు పంటకన్న మన దళాలు కొన్ని 50 నుంచి 100 ప్రతిశతివరకూ అదనంగా పండిస్తున్నాయి కదా. దీన్నిబట్టి మనలో ముందుకు పోతున్నవారి దగ్గర మనం వ్యవసాయ పద్ధతులలో శిక్షణ పొందడం అవసరమని తేలుతున్నది", అన్నాడు ఒక ఉపన్యాసకుడు.

ఇంత తీవ్రంగా సాగిన ఈ "ఇష్టాగోష్టి" ఎంతో పొద్దుపోయిన దాకా జరిగింది.

★



సమావేశం ముగిశాక:-అంతా స్పష్టంగా తేలాక మరునటి రోజున, సమిష్టిక్షేత్ర కర్షక కుటుంబాలు తమతమ గృహాల్లో కూర్చుని వారివారి ఆదాయాలను పరిగణించుకొంటున్నారు.

గ్రిగోర్ది అలెక్సేవ్, ఆయన కుటుంబం 1956 లో 5,600 రూబుళ్ళ నగదు, మార్కెట్ ధరనుబట్టి 25,000 రూబుళ్ళ విలువగల 196 మెట్రిక్ సెంట్నర్ల బంగాళా దుంపలు, కాయగూరలు గడించారు. గ్రిగోర్ది అలెక్సేవ్ లెక్కనుబట్టి, గత సంవత్సరపు కుటుంబాదాయం, వాళ్ళ సొంత కాయగూరల తోటపై వచ్చిన ఆదాయంతో కలిపి రమారమి 40,000 రూబుళ్ళవుతుంది.

# ఫైర్మన్ స్మిర్నోవ్‌కు



ఫైర్‌మన్ నికొలాయ్ స్మిర్నోవ్

*ఐదంతస్తుల మేడమీదనుండి స్మిర్నోవ్ ఒకవృద్ధురాలినీ, ఆమె మనుమణ్ణి, ఒక సన్నని అంచుగుండా మోసుకవచ్చి రక్షించాడు. ఈ వీరకృత్యం చేసినందుకు ఆయనకు అరుణతార పతకము బహూకరింపబడింది. తన పతకాన్ని స్వీకరించడానికి ఆయన క్రెమ్లిన్‌కు వెళ్లినప్పుడు అధ్యక్షుడు వొరోషిలోవ్ ఆయనను ప్రత్యేకంగా తన కార్యాలయానికి ఆహ్వానించారు. సోవియట్ దేశంలో స్మిర్నోవ్ వంటి వీరులు వున్నందుకు సోవియట్ ప్రభుత్వం గర్విస్తుందని అధ్యక్షుడు ప్రశంసించారు.*

"మీకు కావాలంటే ఆ యిల్లు చూపిస్తాను" అన్నారు, నికొలాయ్ స్మిర్నోవ్, నాకు ఆయనతో పరిచయమైన తర్వాత.

ఫైర్మేన్లు డ్యూటీమీద ఉన్నప్పుడు సాధారణంగా కూర్చొనే మడతకుర్చీమీదినుండి లేచి, డెస్కుదగ్గరకు వెళ్ళి ఒక ఛాయా చిత్రాన్ని బయటికి తీసారాయన. ఆ ఛాయాచిత్రంలో ఆయనతోపాటు ఆనందంతో ముఖం కళకళలాడుతున్న ఒక బాలుడు, ఒక వృద్ధురాలు ఉన్నారు. వారి వెనుకనే ఒక ఎత్తయిన అయిదంతస్తుల భవనం కూడా కనబడింది.

"ఆ కిటికీగుండా వాళ్ళను నేను బయటికి తీసుకవచ్చాను" అన్నారు స్మిర్నోవ్, అయిదవ అంతస్తులోని ఒకకిటికీవైపు చూపిస్తూ. "అక్కడినుంచి పైకి ఎక్కిన నిచ్చెన అదే."

"అయితే మంటలమధ్య మృత్యుముఖంలో చిక్కుకొన్న ఈ వృద్ధురాలినీ, ఆ బాలుణ్ణేనన్నమాట మీరు రక్షించింది ?"

"అవును. అన్నా రోదియోనోవ్నా జైత్సేవా ఆమే. వయస్సు అరవైయేడేళ్లు, వన్యా అనే ఆ బాలుడి వయస్సు ఎనిమిది సంవత్సరాలు. ఈ మధ్యనే పాఠశాలలో చేరాడు. ఆ సంఘటన జ్ఞాపకార్థం మేము ఈ ఛాయాచిత్రం తీయించుకున్నాము.

"అసలా సంఘటన యెలా జరిగింది ?"

అప్పటికి బాగా రాత్రయింది. స్మిర్నోవ్ నిద్రపోతున్నారు. నిద్రలోనే అతనికి, హఠాత్తుగా యెవరో అరిచినట్టు వినిపించింది. దిగ్గునలేచి చూచేటప్పటికి యెదుటి భవనం తగలబడిపోతూ ఉండడం కనుపించింది. ఎవరో సహాయం కొరకు కేకలు పెడుతున్నారు. అందులో సందేహమేమీ లేదు.

స్మిర్నోవ్ వీధిలోకి పరుగెత్తారు. ఆ కేకలు వినబడుతున్న గది అయిదవ అంతస్తులో ఉన్నది. మెట్లు తగలబడి పోతుండడం మూలాన ఆ అంతస్తునుండి క్రిందికి దిగడానికిగాని పైకి వెళ్లడానికిగాని వీలులేకుండా అయిపోయింది. ఒకేఒక మార్గం మిగిలి వున్నది. మంటలను తప్పించుకొని యెట్లాగైనా పైకి ఎక్కాలి. కాని తీరా అక్కడికి యెక్కిన తర్వాత కిటికీని చేరుకోవడం యెట్లా? అక్కడికి చేరుకోవడానికి పదిగజాల దూరం ఒక సన్నని అంచుమీద నడిచి వెళ్ళాలి.

స్మిర్నోవ్ వెంటనే అయిదవ అంతస్తుకు యెక్కిపోయారు. "నికొలాయ్, ఎక్కడికి వెళుతున్నావు ?" అని అతనిభార్య అంటున్నా వినిపించుకోలేదు. "నేను మేల్కొనడం మంచిదే అయింది!" అని మాత్రం అనుకొన్నారు.

పైకి చేరుకున్నాక గోడకు దగ్గరగా అనుకుని నెమ్మదిగా కిటికీవైపు కదలసాగారు. ఒక్కొక్క అంగుళమే జాగ్రత్తగా కదలవలసివచ్చింది. అంతా నిశబ్దంగా ఉండడం మూలాన కలప తగులబడుతూ ప్రేలుతున్న శబ్దం స్పష్టంగా వినబడసాగింది. క్రింద చేరిన జనం ఊపిరిబిగబట్టి చూస్తున్నారు.

చిట్టచివరికి స్మిర్నోవ్ ఆ గదికి చేరుకున్నారు. పొగ కళ్ళల్లోకి వచ్చి యేమీ కనబడకుండా చేసేస్తున్నది. అతి కష్టంమీద, ఒక మూల భయంతో నక్కివున్న వృద్ధురాలినీ, బాలుణ్ణి చూచారు.

"బయటికి పోదాం పదండి!" అంటూ ఆ బాలుణ్ణి తీసుకొని కిటికీ అంచుమీద కూర్చోబెట్టారు. బాలుణ్ణి తన కాళ్ళమధ్య ఉంచుకొని ఆ సన్నని అంచుమీదుగా నెమ్మదిగా కదులుతుంటే క్రింద చేరిన జనం ఊపిరి బిగబట్టి చూడసాగారు.

"భయపడకు, నెమ్మదిగా వెళ్దాము. ఏం భయంలేదు...."

ఈ విధంగా, నెమ్మదిగా ఆ బాలుని తీసుకొని నిచ్చెన దగ్గరకు

# అధ్యక్షుడు వొరొషిలోవ్ దర్శనం

చేరుకొనేటప్పటికి ఒక మిలీషియా మనిషి అతనిని అందుకున్నాడు. స్మిర్నోవ్ అంచుమీదుగా మళ్ళీ కిటికీ దగ్గరకు వెళ్ళారు. వృద్ధురాలు స్పృహతప్పి పడిపోవడానికి సిద్ధంగా వున్న సమయానికల్లా అక్కడికి చేరుకున్నారు

"భయపడకమ్మా. నేను నిన్ను బయటికి చేర్చుతాను." అంటూ అన్నా రోదిమోనోవ్నాకు ధైర్యం చెప్పారు తొందరగా మనం బయట పడాలి. లేకపోతే ఇటువైపుగూడా మంటలు అలుముకుంటాయి.

ఆమెలేచి బయటికి రావడానికి సిద్ధపడ్డది. స్మిర్నోవ్ ఆమెను జాగ్రత్తగా తీసుకొనివచ్చి చెయ్యి పైనవేసి. నెమ్మదిగా అంచు మీది నుండి నడిపింపసాగారు.

ఇంకా వాళ్ళు ప్రక్కగది కిటికీని దాటారో లేదో వాళ్ళు వచ్చిన కిటికీ అద్దాలు భళ్ళునపగిలి. కిటికీ తగులబడడం ప్రారంభించింది

అలా ఆ వృద్ధురాలిని కాపాడి స్మిర్నోవ్ క్రిందికి దిగి వీధిలోకి వచ్చేరు. అతని భార్య. వాళ్ళ మూడు సంవత్సరాల కుమారుడ్ని ఎత్తుకొని ఆదుర్దాగా భర్తదగ్గరకు ఉరికింది.

ఆరోగ్య శాఖలో ఉద్యోగంచేస్తున్న స్మిర్నోవ్ భార్య మర్నాడు తన ఉద్యోగంలోకి వెళ్ళినప్పుడు ఆమె తోటి ఉద్యోగులు ఆమెకు ఒక పూలగుత్తిని బహూకరించేటప్పటికి ఆమె ఆనందానికి అంతు లేక పోయింది. ఆమె భర్త జరిపిన సాహసచర్యను గురించి వారంతా విన్నారు.

అటుతర్వాత కొద్దికాలానికే నికొలాయ్ స్మిర్నోవ్‌కు "ఆర్డర్ ఆఫ్ ది రెడ్‌స్టార్" బిరుదు ఇవ్వబడింది.

సోవియట్ దేశ సుప్రీమ్ సోవియట్ అధ్యక్షవర్గం సభాపతి క్లిమెంట్ యెఫ్రిమోవిచ్ వొరొషిలోవ్ స్వయంగా యీ బిరుదు ప్రదానం చేశారు ఆ రోజున స్మిర్నోవ్ అధ్యక్షునికి అతిథిగా కూడా ఉన్నారు.

ప్రభుత్వం ఇచ్చిన బిరుదులను స్వీకరించడానికి క్రెమ్లిన్ మహాభవనానికి ఇంకా అనేక మంది కూడా ఆహ్వానింపబడ్డారు వారిలో ఇంజినీర్లు. కళాకారులు, కార్మికులు, జనరల్‌లు వున్నారు. వొరొషిలోవ్ దాదాపు అందరినీ పిలిచి బిరుదులను అందజేశారు. కాని స్మిర్నోవ్ ఇంకా పిలువబడలేదు. చివరికి యెవరో ఇలా అన్నారు :

"కామ్రేడ్ వొరొషిలోవ్ మీకు బిరుదును విడిగా ఇస్తారు. మీతో మాట్లాడాలని ఉద్దేశపడు తున్నారు."

వొరొషిలోవ్ స్మిర్నోవ్‌కు బిరుదు ప్రదానంచేసి, కరచాలనం చేసిన తర్వాత, తన కార్యాలయానికి రమ్మని ఆహ్వానించారు. అక్కడ ఇద్దరూ ఒక టేబుల్ ముందు కుర్చీలలో కూర్చొని మాట్లాడుకొన్నారు.

స్మిర్నోవ్ జరిపిన సాహస చర్యలకు ప్రభుత్వం గర్వపడుతున్నదనీ, సోవియట్ ప్రజలలో సాహసవంతులు యెందరెందరో ఉన్నారనీ, ఆ విషయమే గత యుద్ధసమయంలో రుజువైనదనీ వొరొషిలోవ్ అన్నారు అటుతర్వాత చటుక్కున నవ్వి ఇలా అడిగారు :

"మీరు ఆ సమయంలో తగులబడుతున్న ఇంటివద్ద లేకపోతే యేమి జరిగి వుండేది ? వాళ్ళిద్దరూ దగ్ధమైపోయి ఉండేవారా ?"

"అబ్బే, అలా యెన్నటికీ కాదు. ఎవరో ఒకరు వాళ్ళను రక్షించివుండేవారు !"

"ముమ్మాటికీ నిజం,"అని అంగీకరించారు వొరోషిలోవ్. "కాని భయంకరమైన అనుభవం, ఆయిదవ అంతస్తు!"

"నాకు భయం కలుగలేదని నేననలేను,"అని ఒప్పుకొన్నారు, స్మిర్నోవ్.

"ఆ అంచుమీదుగా మీరు నాల్గు పర్యాయాలు నడిచారుగదూ?"

"అవును, నాల్గుపర్యాయాలు"

"ఎంత వెడల్పున్న దది ?"

"ముప్పై సెంటీమీటర్లు."

"గొప్ప సాహసవంతులు !" అని నవ్వారు, వొరోషిలోవ్. "ఎత్తైన స్థలాలంటే మీకు భయంలేదనుకుంటాను కళ్లు తిరగలేదూ?"

"ఎత్తైన స్థలాలు యెక్కడం నాకలవాటే; భయం వుండదు:"

(మిగత ౩౮వ పుటలో)

అగ్ని ప్రమాద మాపన తర్వాత అగ్నిమాపకుడు, తాను రక్షించిన వాళ్లు ఎట్లావున్నారో చూడడానికి వెళ్ళారు. అవ్వ, మనమడు స్మిర్నోవ్‌కు సంతోషంగా స్వాగతమిచ్చారు



# శాంతి స్నేహాల పర్వదినం






ఈ భవనానికో స్వీయచరిత్రవుంది. జారుయొక్క ప్రభువులలో ఒకరికని, 18వ శతాబ్దం చివర రష్యన్ వాస్తుశిల్పి తవ్‌రోవ్ దీనిని నిర్మించాడు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో జర్మన్ దురాక్రమణదారులు దీనిని విధ్వంసం చేశారు. యుద్ధానంతరం విద్యార్థులు దీనిని ఆ శిధిలాలలో నుంచి పునరుద్ధరించారు. ఇప్పుడిది ద్నిప్రొపెత్రోవస్క్ విద్యార్థుల సంస్కృతీ భవనం.

సంస్కృతీ భవనంలో మహోత్సవానికి ముందటి ఈ రోజులలో, విద్యార్థుల జీవితం హుషారుగావుంది. ప్రతి వ్యక్తికీ పర్వదినాన్ని గురించే ఆలోచన. ప్రతివ్యక్తీ మహోత్సవ కార్యక్రమంలోనే నిమగ్నమవడం. భవనపు బోర్డు, ద్నిప్రొపెత్రోవస్క్ యువజనుల మహోత్సవపు కార్యక్రమాన్ని గురించి మరోసారి సమాలోచించను సమావేశమవుతున్నది.







ద్నిప్రొపెత్రోవస్క్ యువకవులూ మహోత్సవానికి సన్నద్ధమవుతున్నారు. మాస్కో, ఆరవ ప్రపంచ యువజనోత్సవంలో వాళ్ళ పాటలు పాడబడ్తాయని ఆశిస్తున్నారు.

ఛాయా చిత్రంలో : విద్యార్థి యవ్‌గినీ కోర్షున్ తన కొత్త పద్యాల్ని పఠిస్తూ.





విద్యార్థి సంస్కృతీ భవన నృత్యబృందం, మాస్కో మహోత్సవంలో పాల్గొనాలని కల గంటున్నది. ఇటీవల, భవన నృత్య బృంద ఎమెచ్యూర్ కళాకారులు అతిక్లిష్టమైన నృత్యాలు, "హంస సరస్సు" "ఛోపిన్యానా"ల ప్రదర్శించారు. మహోత్సవానికని ఈ బృందం, వాగ్గేయకారుడు సొలొవ్యోవ్-సిదోయ్ విరచించిన ఉత్తేజకరమైన, సహజ నృత్యం "తారస్ బుల్బా" ప్రదర్శించను శిక్షణ పొందుతున్నది.

ఛాయా చిత్రంలో: విద్యార్థి నర్తకీ మణులు ఇన్నా వాసొక్వవస్కయా, స్వెత్లానా కెనిస్ "ఛోపిన్యానా" నృత్యాన్ని ప్రదర్శించను వేదికమీదికి పోబోయే ముందు.



వెస్వలోద్ విష్నెవ్‌స్కీ విరచించిన "ఆశాపూరిత విషాదం" అనే నాటకంలో విద్యార్థులు యల్. లెమ్‌కే, వి. ద్రొజ్దోవా, బి. ఇసిన్.



ఆరవ ప్రపంచ యువజన, విద్యార్థి ఉత్సవంలో చిత్రకళా ప్రదర్శనం కూడా వుంటుంది. ద్నిప్రొపెత్రోవస్కీ విద్యార్థి భవన కళావిభాగ సభ్యులు, కళా విభాగాధిపతి, చిత్రకారుడు ఇగోర్ త్రోషిమాస్కో ప్రదర్శనకని శ్రద్ధగా కళా ఖండాలను ఎన్నిక చేస్తున్నారు.



భవన నృత్య బృందం ప్రదర్శించబోతున్న "తారస్ బుల్బా" నృత్య కళాకారుల వేషధారణకు నమూనాల సమకూర్పుటలో భవన కళా విభాగ సభ్యులు సాయపడుతున్నారు.



# మహోత్సవ కార్యక్రమం

(గతసంచిక తరువాయి)

## సాంస్కృతిక కార్యకలాపాలు

పలుదేశాల విద్యార్థిగీతాల గానానికి సాయంసభ.

"ప్రపంచ విశ్వవిద్యాలయాలు". (దుస్తుల ప్రదర్శనం, విద్యార్థి గీతాల గానం మొదలైనవాటితో వివిధదేశాల విశ్వవిద్యాలయ సాంప్రదాయాలకు సంబంధించిన సాయంసభ).

విద్యార్థి కార్నివాల్.

వివిధదేశాల ఉత్తమ విద్యార్థి బృందాలచే అంతర్జాతీయ విద్యార్థి ప్రదర్శనలు.

## అంతర్జాతీయ విద్యార్థుల క్లబ్బు

ఉత్సవంలో పాల్గొనే విద్యార్థులకు, అంతర్జాతీయ విద్యార్థుల క్లబ్బు ఒక శాశ్వత కేంద్రంగా వుంటుంది. విద్యార్థుల వివిధ ప్రయోజనాలను గణనలోనికి తీసుకునే కార్యకలాపాలు రోజూ ఏర్పాటు చేయబడతాయి. విద్యార్థులు యిష్టాగోష్ఠి సమావేశాలకు యీ క్లబ్బు స్థానంగా వుంటుంది. దానిలో పఠన మందిరాలు, ఒక కేఫే, చదరంగం గదులూ, సమావేశాలకు హాల్సు మొదలైనవి వుంటాయి.

ఈ దిగువ కార్యకలాపాలు అంతర్జాతీయ విద్యార్థుల క్లబ్బు కార్యక్రమంలో చేర్చబడుతాయి (ఉత్సవంలో పాల్గొనేవారి అభిప్రాయాలను తెలుసుకున్నాక):

"అంతర్గ్రహ యాత్ర"గురించి ఉపన్యాసం, దానిపైని ప్రశ్నలు, జబాబులూ.

చర్చ: "జాతీయ సంస్కృతీ అభివృద్ధి", తరవాత ప్రముఖ విదేశీ, సోవియట్ సంస్కృతీ వేత్తల ప్రసంగాలు.

"విద్యార్థులు, ప్రపంచ సంస్కృతి" గురించి ఉపన్యాసం; దానిపై ప్రశ్నలూ, జబాబులూ.

పలుదేశాల ప్రముఖ గ్రంథకర్తలతో, కవులతో సమావేశాలు.

చర్చ: "విశ్వవిద్యాలయం. సమాజం."

చర్చ: "విద్యా సంస్కరణలు."

విద్యార్థుల నృత్యం.

సంస్కృతీ రంగంలో విద్యార్థుల సహకారం గురించి సమావేశం. ఒకే రంగాలలో ప్రత్యేకవిద్య నభ్యసిస్తోన్న విద్యార్థుల మధ్య ఆదాన ప్రదానాలు.

సోవియట్ అంటార్కిటిక్ ఎక్స్‌పెడిషన్ సభ్యులతోసమావేశం.

విద్యార్థులు నిర్మించిన చలనచిత్రాల ప్రదర్శనం, ఉత్సవంలో పాల్గొనే దేశాల విద్యార్థుల జీవితం, విద్యార్థి ఉద్యమంగురించి విద్యార్థి ప్రతినిధివర్గాలచే ఉపన్యాసాలు.

విద్యార్థి ప్రచురణల, పత్రికా రచనల విద్యార్థుల సంపాదకుల సమావేశం.

వివిధదేశాల విద్యార్థి ప్రతినిధివర్గాల సమావేశం.

విద్యార్థులకొరకు పెద్ద కళా ప్రదర్శనం.

సాయంనృత్యం.

50 బల్లలపైని ఒకేసారి చతురంగ క్రీడా ప్రదర్శనం.

విద్యార్థి సింఫనీ ఆర్కెస్ట్రాచే సింఫనీ ఖండాల వాద్యం.

జాజ్ సంగీత సాయం గోష్ఠి.

నృత్య పాఠశాలల విద్యార్థుల ప్రదర్శన.

ప్రముఖ సోవియట్ నాటకకళాకారుల సమావేశం.

## రంగస్థల ప్రదర్శనలు

1. సంగీత కచేరీలూ, నాటకాలూ (వివిధ వస్తువులూ, రూపాలూ గలవి).

2. అంతర్జాతీయ గానోత్సవం: జాతీయ గాయక బృందాలచే ప్రదర్శనలు. వివిధ ప్రతినిధివర్గాల గాయక బృందాల సంయుక్త బృంద గాయకులు ప్రఖ్యాతమైన యువజన గీతాలను గానం చేస్తారు. వీటి సంగీతమూ, గీతాలూ ముందుగా అందజేయబడతాయి. ప్రజాభిమానాన్ని చూరగొన్న గీతాలను నేర్చుకునేందుకు సమావేశాలు.

3. జానపద నృత్యోత్సవం. జాతీయ నర్తక బృందాల, సోలోయిస్టుల ప్రదర్శనలు. సమూహ పోటీలు, జానపద నృత్యాలలో ఉత్తమంగా ప్రదర్శించినవారికి బహుమతులు. జానపద నృత్యాలను నేర్చుకునేందుకు సమావేశాలు.

4. ప్రతిభాశాలురైన యువజనుల ఉత్సవం. ఉత్సవ పోటీలలో గెల్చినవారి ప్రదర్శనలు. (సశేషం)

---

## గమనిక

1957, ఏప్రిల్ 1 నుంచీ, నయా పైసలు చలామణిలోకి రావడంతో, మా పత్రిక ధరలు ఈ దిగువ రీతిన నిర్ణయించడమైనది:

### చందా వివరాలు:

| | సంవత్సరానికి | అర్ధ సంవత్సరానికి | మూడు నెలలకు |
|---|---|---|---|
| కొత్త కరెన్సీనిబట్టి | రు. 4-0-0 | రు. 2-0-0 | రు. 1-10 నయా పైసలు |
| పాత కరెన్సీనిబట్టి | రు. 4-0-0 | రు. 2-0-0 | రు. 1-2 అణాలు |

విడి ప్రతి 20 నయా పైసలు లేదా, మూడణాలు

మూడణాలు, పందొమ్మిది నయాపైసలే అయినప్పటికీ, లెక్కల సౌలభ్యంకోసమని విడిప్రతి ఖరీదు 20 నయా పైసలుగా నిర్ణయింప బడినది.

కొత్త నాణెములలోగాని, పాత నాణెములలోగాని నగదు చెల్లించవచ్చును.



సెలవులకు ఎవరి పథకాలు వాళ్ళకుంటాయి. కొందరు పెద్ద సంచుల్లో సామాన్లు సర్దేస్తారు: మంచుకప్పిన అరణ్యాలను, సశ్యామల సువిశాల క్షేత్రాలను సందర్శిస్తారు, పొగమంచుతో నిండిన గాలిని అనుభవిస్తారు.



మంచుకొండమీద జారేటప్పుడు ఫర్‌కోటు వేసుకుంటే బాగుంటుంది.

# చలికాలపు సెలవుల్లో

"పరీక్షరోజులు", "డీన్ కార్యాలయం", "పరీక్ష"లాంటి విషయాలన్నింటినీ మరచిపోయే క్షణాలు, విద్యార్థులకు ఆనందదాయకమైన సెలవు రోజులు మొదలుకొని చివరిదాకా ఉంటాయి. ఎందుకు? అంటే, కొన్ని బృహద్గ్రంథాలు చదవండి. ఒకవంద చిత్రపటాలు తయారుచెయ్యండి. కొన్ని రాత్రులు, నిర్విరామంగా నిఘంటువుల్ని తిరగెయ్యండి, పాఠ్యగ్రంథాలు చదవండి. అప్పుడు మీకు తెలుస్తుంది ఎందుకో?

ఇక్కడ మేము మా ఛాయాచిత్రగ్రాహకుడు, సోవియట్ విద్యార్థులు తమ చలికాలపు సెలవుల్ని ఎట్లా ఉత్సాహంగా గడుపుతారో చూపుతూ తీసిన ఛాయాచిత్రాలను ప్రకటిస్తున్నాం.



గౌరవనీయుడైన ఒక వ్యక్తి, ఇరవైయేళ్ళ తర్వాత, ఈ ఛాయాచిత్రాన్ని చూచి, ఆశ్చర్యాన్ని ప్రకటించి "నేను కాదే"అని, అనొచ్చు. ఇరవయ్యేళ్ళలోపు విద్యార్థులు అట్లాంటి పెద్దరికాలను హేళనచేస్తారు. పూలకుండీమీద నిల్చొని ఒక విద్యార్థి, "వేదాంతాధ్యాపకుల స్మృతి చిహ్నం"అని ప్రకటిస్తున్నాడు. ఆ తర్వాత డీన్, ద్వారపాలకుడి స్మృతిచిహ్నాలు వస్తాయి. బూరెబుగ్గలు చేసుకొని ఇంకోవిద్యార్థి "ఇదిగో, ఇది నా స్మృతి చిహ్నం"అని, నవ్వు ఆగబట్టుకోకలేక, చుట్టూవున్నవాళ్ళతో కలిసి నవ్వుతున్నాడు.

మంచుమీద ఫుట్-బాల్ ఆడే పిల్లలు. వీరికి ఎన్నేళ్లు అనుకుంటారు మీరు? అయిదా, ఏడా, పదా? అదేంకాదు. వీళ్ళంతా ఇరవయ్యేళ్ళ ప్రాయపువాళ్లు! వీళ్ళంతా మంచి క్రీడాకారులు ఇక్కడ మీరు చూస్తున్నది ఉత్సాహపూరితమైన శిక్షణాకాలాన్ని కాదు, యిరవై యౌవనోత్సాహాన్ని



"కపుస్నిక్"అంటే ఏమిటో మీకు తెలుసా? ఇది మీవిజ్ఞాన సర్వస్వాల్లో కనుపించదు, కాని ఏ విద్యార్థి నడిగినా చెబుతాడు అది "వ్యంగ్య ప్రదర్శన"అని. "కపుస్నిక్" అంటే అర్థం క్యాబేజి వంటకమని. కేవలం, క్యాబేజి వంటకంతో విద్యార్థులు కడుపునింపుకొనే రోజులు పొయ్యాయి. చాలీచాలని క్యాబేజి వంటకంతో పాటు ఒక సరసోక్తి మిరియపు పొడి లా చల్లుక తినడం విద్యార్థులకు ఒకప్పుడు పరిపాటి. విద్యార్థుల సంప్రదాయాలుపవిత్రమైనవి. ఇప్పుడిక్కడ మేం. "కపుస్నిక్"ఆరగించమని ప్రకటిస్తున్నాం.

ఎవరో ఒకరు ఒక మాటంటారు. ఇంకోడు హాస్యంచేస్తాడు. ఇంక పాట తయారవుతుంది. ఇప్పుడు,పరిపాటిగా పాడుకోబడుతున్నపాటలు ఇట్లాంటి విద్యార్థి-సమ్మేళనాలలో పుట్టి ప్రాచుర్యానికి వచ్చినవే! →





"కపుస్నిక్" ఆయిపోయింది. తెర ఎత్తబడింది. ప్రేక్షకులు ప్రదర్శకుల్ని, దానిని రచించి, దానికి సంగీతంకట్టి, తయారుచేసినవారిని పిలిచి అభినందిస్తున్నారు. ఇక్కడ చేరినవాళ్లంతా మంచి స్నేహితులే. ఏదో ఒక సరసోక్తివల్ల, ఎవరయినా మనస్సు నొచ్చుకున్నా ప్రేక్షకు లందరితో కలిసి, గొంతుకలిపి పాడ్తాడు!

"మాటలలోకల్ల మంచి మాటలకంటే మంచివి మాకు నేడు మీ హాసమ్ములు!" ↓

↑ శరీరనిర్మాణ శాస్త్ర పరీక్ష జరుగుతున్న గది గడప దగ్గర దృశ్యం. కింకర్తవ్యం అన్న ఆశంకలో చిక్కుకున్నాడు. ప్రయత్నించడమా లేకపోతే జ్వరాన పడడమా? అతని పక్కవాడు జ్వరాన పడనే పడ్డాడు. ఆతని మూత్ర జననావయవాలు ఎక్కడున్నాయో ఆతనికి తెలియడం లేదు, గుండె ఎక్కడుందో, అంతా అగమ్యగోచరంగా వుంది.





భారతీయుడు అజోయ్‌రాయ్, అతని రష్యన్ స్నేహితురాలు లెనా రుదాకోవా

శ్రీమతి జయారాయ్ సోవియట్ దేశానికి 1950 లో తన భర్తతో వచ్చారు. ఆమె గుజరాత్‌కు చెందినవారు. ఆమె భర్త బెంగాలీ జాతికి చెందినవారు. ఐదేళ్ళ ప్రాయపువాడైన ఆమె కుమారుడు అజోయ్ మాస్కోలో పుట్టాడు. ఇప్పటికి రెండేళ్ళుగా అజోయ్ ఒక బాలోద్యానవనానికి వెళ్తున్నాడు. దీనినిగురించి శ్రీమతి జయారాయ్ యీ వ్యాసంలో తెలియజేస్తారు. ఆమె వ్రాసిన వ్యాసం ఒకటి యీ పత్రిక ఐదవ సంచికలో ప్రచురింపబడింది.



# బాలోద్యానవనంలో ఒకరోజు





## < జయారాయ్ >

మా యింటికి సుమారు పావుమైలు దూరంలోవున్న ఒక బాలోద్యానానికి అజోయ్ వెళ్తున్నాడు. కొన్ని బాలోద్యానవనాలు విద్యా మంత్రిత్వ శాఖక్రింద వుంటాయి. ఈ బాలోద్యానవనాలకు దగ్గర్లో వున్న పిల్లలకివి శిక్షణ నిస్తాయి. ఫ్యాక్టరీలకు, పరిశ్రమలకు, పెద్ద సంఘాలకు, సంస్థలకు స్వంత బాలోద్యానవనాలుంటాయి. ఇవి యీ పరిశ్రమల, సంస్థల సిబ్బందికి చెందిన పిల్లలకు శిక్షణ నిస్తాయి.

అజోయ్‌ను వాడి బాలోద్యానవనానికి తీసుక వెళ్ళేటప్పుడూ నేను తరచుగా అక్కడికి వెళ్తుంటాను. అప్పుడప్పుడు నేను తలిదండ్రుల సమావేశాలకూ, పండగలకు పిల్లలు తామే ప్రదర్శించే ప్రదర్శనలకూ వెళ్తుంటాను. పిల్లల పెంపకానికి సంబంధించిన సకల సమస్యల చర్చలలోకూడా నేను పాల్గొంటాను. అజోయ్ నాకు తన స్నేహితుల గురించి, ఉపాధ్యాయుల గురించి, బాలోద్యానంలో జీవితం గురించి, తాము ఏమి తింటారో, ఏమేమి ఆటలు ఆడుకుంటారో అంతా చెప్పేస్తాడు.

అంచేత వాళ్ళ బాలోద్యానవనంలో జరిగేదంతా, వారి నిత్య జీవితమూ, వారి అభిరుచులూ నాకు తెలుస్తూ వుంటాయి. అయినా ఒకరోజల్లా పిల్లలతో గడపాలనీ, వాళ్ళేమి చేస్తారో, ఎలా ప్రవర్తిస్తారో కళ్లారా చూడాలనీ నాకెప్పుడూ అనిపిస్తూ వుండేది. 1956 డిసెంబరు 20వ తేదీని యీ అభిలాషను తీర్చుకోవడానికి నాకు అవకాశం లభించింది.

ఆరోజు ఉదయం మేము మామూలువలెనే ఏడున్నర గంటలకు



తన కుమారుడు అజోయ్‌కి దుస్తులు విప్పుకోవడంలో సాయపడుతోన్న జయా రాయ్→



లేచి, బాలోద్యాన వనానికి ఎనిమిదిన్నరకి బయలుదేరాము. సుమారు ఎనిమిది గంటల ఏభై నిమిషాలకు మేము బాలోద్యానవనాన్ని చేరుతుండగా చాలామంది పిల్లలు కూడా బస్సులో వస్తున్నారు. అజొయ్‌ను చూడగానే వారు వాణ్ని పేరుపెట్టి పిలవసాగారు, తరవాత గబగబా మేడమెట్లెక్కారు, ఒకరినిమించి ఒకరు వెళ్ళి తానే మొదట చేరడానికి. నేను మెల్లగా మెట్లెక్కాను, గోడలకు తగిలించివున్న పిల్లల ఛాయాచిత్రాలను చూస్తూ.

హాలులోనికి ప్రవేశించడానికి ముందర—యిక్కడ అజొయ్ బృందం సమావేశమైంది—మేము యింకో చిన్నగదిగుండా వెళ్ళవలసి వచ్చింది, ఇక్కడ వరసగా చిన్నచిన్న అరలు చాలావున్నాయి. వాటిపైని ఒకొక్కదానికీ ఒకొక్క చిత్రం వుంది. ప్రతి కుర్రవాడికీ ఒక అరవుంది. దానికివున్న చిత్రాన్నిబట్టి తమ అరలను పిల్లలు గుర్తుపడ్తారు కొందరికి జంతువుల చిత్రాలున్నాయి. కొందరికి పిట్టలవీ, ఆట వస్తువులవీ, యంత్రాలు మొదలైనవాటివీ చిత్రాలున్నాయి. అజొయ్ అరకు ఒక రైలుబొమ్మ వుంది. నేను గదిలో ప్రవేశించేసరికే పిల్లలు తమ దుస్తులను విప్పుకుంటున్నారు. తమకుతాముగా బట్టలు విప్పుకోవడం వారికి నేర్పబడింది. కాని అజొయ్‌కి నేను సాయంచేయకుండా వుండ లేకపోయాను.

పిల్లలు తమ అదనపు ఉన్ని బట్టలన్నిట్నీ తీసివేశాక, తెల్ల వార్లుగల దట్టమైన నీలపు స్మోక్స్, స్లిప్పర్లు వేసుకున్నారు. తరవాత పిల్లలు తమ వస్తువులను చక్కగా అరల్లో అమర్చుకున్నాక, తలుపు వేసి పెద్ద హాలులోనికి పరుగెత్తారు.

వారి బృందం ఉపాధ్యాయిని అయిన నటాలియా మిహైలోవ్నా



సూర్యకాంతి తగినంతగా పిల్లలకు సోకనప్పుడు, కృత్రిమ సూర్యకిరణాల ప్రసారం చేస్తోన్న—క్వార్ట్జ్ ల్యాంప్

ఎవరు బాగా చెట్టు బొమ్మ వేస్తారోనని, ఇవ్వాళ పిల్లలు చిత్రరచనలో నిమగ్నులైవున్నారు



అప్పటికే హాలులోనికి వచ్చింది. మేము పలకరించుకున్నాము. పిల్లలు పరుగెత్తడం మొదలుపెట్టారు, ముందరి రోజు ముచ్చట్లను ఒకరితో ఒకరు చెప్పుకుంటూ. నేను వారితో ఒకరోజల్లా గడపడానికి నిశ్చయించుకున్నానని తెలుసుకుని నటాలియా మిహైలోవ్నా చాలా సంతోషించింది.



తొమ్మిది గంటలసరికి పిల్లలంతా వచ్చారు. ఉదయాహారం తినడానికి ముందర వాళ్ళు మళ్ళీ చేతులు కడుక్కున్నారు. నీళ్ళగదిలో పిల్లలకోసం వరుసగా చాలా చిన్న తువ్వాళ్ళున్నాయి. నీళ్ళగదిలో ప్రవేశించగానే ప్రతి బాల తన తువ్వాలును తీసుకుని, చేతులు కడుక్కుని, ఆరబెట్టుకుంటాడు; తరవాత హాంగరుమీద తువ్వాలును వేస్తాడు. తరవాత తన చిన్న టేబులు ముందర కూచుంటాడు.



ఒకొక్క కుర్చీమీద వారి అప్రన్లున్నాయి. ప్రతి బాల తన అప్రన్ను వేసుకు కూచొని ఉదయాహారం కోసం వేచివున్నారు.

గదంతా ఉల్లాసంగావుంది. టేబిళ్ళమీద పూలగోలాలున్నాయి, టేబిళ్ళకు పైగానున్న గోడలకు పూల తైల చిత్రాలున్నాయి. ఈ చిన్న టేబిళ్ళ చుట్టూరా కూచొనివున్నపిల్లలు ఆట బొమ్మల్లాగా కనిపిస్తున్నారు.

ఉదయాహారంలో రొట్టె, వెన్న పాలతో తియ్యని పోరిడ్జ్—యిది పిల్లలకు చాలా యిష్టమైన ఒక వంటకం—, కాఫీ వున్నాయి.












మంచి గాలిలో బాగా నడిచివచ్చాక, అజొయ్‌కి బాగా ఆకలవుతున్నది

ఉదయాహారాన్ని ఆరగించాక పిల్లలు రష్యన్ "అధ్యయనం" చేశారు. సరిగా మాటాడడం, సరిగా ఉచ్ఛరించడం నేర్పడానికి ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకోబడుతుంది. పిల్లలు పద్యాలు కూడా నేర్చుకుంటారు. పద్యాలంటే వారికి చాలాయిష్టం. అజొయ్‌కి ఎన్నో పద్యాలూ, కథలూ రావడం చూసి నాకెంతో ఆశ్చర్యం వేసింది. వాళ్ళు సంగీతం, నృత్యం, చిత్రలేఖనం, కాగితంతో వస్తువులు చేయడం, ప్లాస్టరుతోనూ, మట్టితోనూ బొమ్మలు చేయడమూ, కుట్టుపనికూడా నేర్చుకుంటారు.

నేను అక్కడికి వెళ్ళినప్పుడు వారికి డ్రాయింగు పాఠం జరిగింది. ఉదయాహారం అయ్యాక టేబుళ్లు శుభ్రపరిచాక పిల్లలకు కాగితం, రంగు పెన్సిళ్ళు, రంగులు యివ్వబడ్డాయి. వారు బొమ్మలు వేయడం మొదలుపెట్టారు. ఇక్కడవున్న బొమ్మల్లో ఒకటి వారు యీ పనిలో వుండడాన్ని చూపుతుంది.

పదిన్నర గంటలకు పిల్లలు దుస్తులు వేసుకుని, ఆడుకోవడానికి తోటలోకి వెళ్లారు. అప్పుడప్పుడు వారు వాహ్యాళికి వెళ్తారు. చెట్టపట్టాలు పట్టుకుని జంట జంటలుగా. ఈ రోజు వాళ్ళు తమ స్లెడ్స్. స్కీలు తీసుకుని ఒక గంటన్నర సేపు సరదాగా కేరింతలు కొడుతూ కొండదిగువకు వెళ్లారు.

బాలోద్యానవనం అధికారిణి అన్నా అలెగ్జాంద్రోవ్నాను చూడడానికి నేను వెళ్ళాను. ఆమె పొడవుగా కండ పుష్టితో రష్యన్ స్త్రీలుండేటట్టుగా ఉంది. ఆమె కార్యాలయంలో కూర్చొని వుండగా ఆమె సోఫామీదనున్న కొన్ని బొమ్మలమీదా, చిత్రాల పుస్తకాలమీదను నాదృష్టి పడింది. బొమ్మలూ, చిత్రాల పుస్తకాలూ బాగున్నాయని చెప్పి, అవి ఎక్కడకొన్నారని అడిగాను. అన్నా అలెగ్జాంద్రోవ్నా చిరునవ్వుతో, బాలోద్యానవనాన్ని చూడవచ్చిన కొందరు జర్మన్ మహిళలు వాటిని కానుకగా యిచ్చారని నాకు చెప్పింది. "ఈ పిల్లల చిత్రాలు మాకు రుమేనియానుండి వచ్చాయి. మా దగ్గర కానుకలు యింకా వున్నాయి" అందామె.

తరవాత సంభాషణ మళ్లీ బాలోద్యానవనం గురించి సాగింది. తమ బాలోద్యానవనం 120 మంది పిల్లలకు శిక్షణ నిస్తుందనీ, వయస్సులవారిగా వారు నాలుగు బృందాలుగా





మధ్యాహ్నం నిద్రలో →



విభాగింపబడ్డాయనీ ఆమె చెప్పింది. ఒక బృందం వారం అంతా బాలోద్యానవనంలోనే వుండిపోతుంది; వారి తలిదండ్రులు వారాంతానికి శనివారం సాయంత్రం మాత్రమే వారిని యిళ్ళకు తీసుకపోతారు. తక్కినవారు పగటిపూట వుండే బృందాలు. ప్రతిబృందమూ అనుభవజ్ఞురాలైన ఒక ఉపాధ్యాయిని క్రింద ఉంటుంది. పనిచేసేవారు 25 మంది.

నెలకు బిడ్డ ఒక్కంటికీ ఖర్చు ఎంత అవుతుందని నేను అన్నా అలెగ్జాండ్రోవ్నాను అడిగాను.

"500" రూబుళ్ళందామె.





నృత్యం నేర్చుకుంటూన్న పిల్లలు, గోపక్ నృత్యం చేస్తూ



"కాని నేను నెలకు 125 రూబుళ్ళు మాత్రమే యిస్తానే" అన్నాను నేను.

ఆమె చిరునవ్వుతూ యిలా చెప్పింది: "నెలకు ముప్పయి రూబుళ్ళుమాత్రం యిచ్చే తలిదండ్రులుకూడా ఉన్నారు."

నేను ఆశ్చర్యపోతూ వుండడం గమనించి, తలిదండ్రులు చెల్లించే మొత్తం వారివారి ఆదాయాలబట్టి వుంటుందని ఆమె వివరించింది. నెలకు రెండువేల రూబుళ్ళకు పైగా ఆర్జించేవారు నెలకు 125 రూబుళ్లు చెల్లిస్తారు. తక్కువ సంపాదించేవారు తక్కువ చెల్లిస్తారు. మిగతా దానిని ప్రభుత్వం యిస్తుంది.

మధ్యాహ్నం బాలోద్యానవనంలోని నిశ్శబ్దతకు భంగం వాటిల్లింది. పిల్లలు వాహ్యాళినుండి తిరిగివచ్చారు. వెలుపల శీతోష్ణస్థితి సున్నకు కాస్త తక్కువగావుంది. అందాత పిల్లలు తిరిగివచ్చాక వారి చెక్కిళ్ళపైని ముద్దుగా గులాబీరంగు వచ్చింది.

సంతోషంగా వున్న వారిముఖాలు, బయట వారు ఎంత ఆనందంగా ఆడుకున్నారో తెలియజేస్తాయి. పిల్లలు గబగబా బట్టలు విప్పుకుని, చేతులు కడుక్కొని భోజనానికి కూచున్నారు. వారు చాలా యిష్టంతో తింటూవుండడం చూస్తే, నడచి వచ్చాక వారికెంతగా ఆకలయ్యిందో తెలుస్తుంది. కొద్దిసేపట్లోనే వారు సూపు తాగేశారు, కట్లెట్, ఉడికించిన బంగాళా దుంపలూ, కంపోట్ తినివేశారు.

భోజనం అయ్యాక విశ్రాంతి సమయం. మా అజొయ్ నిద్రపోతాడా అని నాకు అనుమానం వేసింది. ఎందుకంటే వాడూ, వాడి "ప్రాణస్నేహితుడు" పెట్యా మధ్యాహ్న భోజనం అయ్యాక నిద్రపోరు. అలాగే యిప్పుడు కూడా వాళ్లు నిద్రపోలేదు. కాని వాళ్ళిద్దరూ చడీచప్పుడూ లేకుండా పడుకున్నారు; తక్కినవారి మధ్యాహ్న విశ్రాంతికి భంగం కలిగించలేదు.

మూడు గంటలకు లేచి పిల్లలు, నిద్రమత్తు వదలడానికి చిన్న చిన్న వ్యాయామాలు చేశారు. తరవాత యిచ్చవచ్చినట్టు ఆడుకోవడానికి అనుమతింపబడింది. కొందరు ఆట బొమ్మలతోనూ, బ్లాకులతోనూ ఆడుకున్నారు, కొందరు జట్లు జట్లుగా రకరకాల ఆటలాడుకున్నారు.

(మిగత 30వ పుటలో)



# సముద్ర గర్భంలోంచి 'టెలి

బి. లయఖోవ్‌స్కీ

ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయి, "దించండి!" అని కెప్టెన్ నౌకమీదినుంచి ఆజ్ఞాపించారు.

నౌకయొక్క 'వించి' ఒక గిలకద్వారా సముద్రములోకి కదల నారంభించింది. క్రింది భాగంలో ఒక ప్రొజెక్టరు కట్టబడివున్న ఒక గంభీరమైన సముద్రపు ఉక్కు పరికరము సముద్ర గర్భంలోకి వెళ్ళిపోయింది....

అధికసంఖ్యలో చేరిన ప్రేక్షకులు చీకటిగా వున్న క్యాబిన్‌లో టెలివిజన్ సెట్టుముందు గుమిగూడారు. నీళ్ళు త్రుళ్ళడము, పాచిపట్టిన నౌక అడుగుభాగము తెరపైన కనబడసాగాయి. అటుతర్వాత నీటి బుడగలు పైకి రాసాగాయి. ఒక చేపల గుంపుయొక్క నీడలు అలా దాటి వెళ్ళిపోయాయి. పెద్ద చెవుల జెల్లీ చేప ఒకటి కనబడింది. కొన్ని రొయ్యలు అటునుంచే వెళ్లాయి. సముద్ర గర్భంలోకి దించబడుతున్న ఉక్కు పరికరంలో టెలివిజన్ ప్రసారం చేసే కెమేరా వుండడంవల్ల సముద్రంలోని విషయాలన్నీ అలాగ తెరపైన కనబడుతూ వున్నాయి.

త్వరలోనే ఆ కెమేరా సముద్రం అట్టడుగుకు చేరుకొన్నది. సముద్ర గర్భంలోని ప్రపంచపు మనోహర దృశ్యం కనబడసాగింది. క్యాబిన్‌లో వున్న టెలివిజన్ ప్రేక్షకులు దట్టమయిన పొదలను, సముద్రపుపాచినీ చూచారు. పసుపుపచ్చ రంగులో వున్న చేపలు ఆ పొదల మధ్యగుండా ఈదుతున్నాయి. ఒక రాతిప్రక్కన పీత ఒకటి పొంచివున్నది. ఒక సముద్రపు కోడి తన రెక్కలను విస్తరించి కూర్చున్నది. సముద్ర పురుగులు అటూ, ఇటూ ఈదుకొని పోతున్నాయి. కాని ఇప్పుడు ప్రారంభింపబడిన పనియొక్క లక్ష్యం ఈ అద్భుతమైన దృశ్యాన్ని చూడడం కాదు. పద్నాలుగు సంవత్సరాల క్రితం "దెస్నా" అను రవాణా నౌక మునిగిపోయిన నొవొరొస్సిక్ సమీప ప్రాంతంలో టెలివిజన్ కెమెరాను సముద్రంలోకి దించిన ట్రాలర్ నౌక "గ్రోత్" ఇప్పుడున్నది. "గ్రోత్" నౌక మీదినుంచి దించిన టెలివిజన్ సహాయంతో సముద్ర గర్భంలో మునిగిపోయి వున్న నౌకను పరిశీలించడానికి నిర్ణయింపబడింది.

మునిగిపోయిన పడవ సమీపానికి వస్తున్నట్లు "గ్రోత్" నౌకమీద వున్న యంత్ర పరికరాలద్వారా తెలియవచ్చింది. అసలు అధికంగా అగుపడుతున్న చేపలను బట్టే ఆ ప్రాంతాన్ని గుర్తించవచ్చు. టెలివిజన్ తెర ఒక జలచర ప్రదర్శనశాలలా కనబడుతున్నది. హఠాత్తుగా, మునిగిపోయిన నౌక అగుపడ సాగింది. సముద్రపు మొక్కలు దానిపైన దట్టంగా పెరిగి వున్నాయి. ఆ మొక్కలు యెంత దట్టంగా పెరిగి వున్నాయంటే, డెక్కుకు చుట్టూ వున్న ఇనుపకడ్డీ అంతా వెంట్రుకలతో కూడివున్నట్లు అగుపడసాగింది. "గ్రోత్" నౌక రెండు పర్యాయాలు సముద్రం నీటిమీదుగా, పద్నాలుగు సంవత్సరాలక్రితం మునిగిపోయిన "దెస్నా" పైన తిరిగి జాగ్రత్తగా పరిశీలించింది.

సముద్ర గర్భంలో పనిచేసే టెలివిజన్ గూడా సాధారణ టెలివిజన్ సూత్రాల ననుసరించే పని చేస్తుంది. కాని అది పనిచేయవలసిన ప్రత్యేక వాతావరణాన్ననుసరించి ప్రత్యేక డిజైనులో తయారు చేయవలసిన అవసరం కలుగుతున్నది.

సముద్ర గర్భంలో పనిచేయడానికి తయారు చేయబడిన ఈ టెలివిషన్ సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తుయొక్క సాగర శాస్త్ర విద్యాసంస్థ మెరీన్ ఎలెక్ట్రానిక్స్ విభాగం పరిశోధనాలయం ఉద్యోగులచేత రూపొందించబడింది. గుండ్రని ఆకారం గల ఒక ఉక్కు పరికరంలో అది ఇమడ్చబడింది. నీటిని లోపలికి రానివ్వకుండా ఇది కాపాడుతుంది.

ఈ టెలివిషన్ సెట్టు ముందు భాగంలో అదనంగా కొన్ని బుడిపెలు, మీటలు, ఇండికేటర్లు ఉన్నాయి. వీటిద్వారా ఈ టెలివిషన్ సెట్టును పైనున్న నౌకలోంచి పనిచేయించవచ్చును. లెన్సును ఫోకస్ చేయాలంటే ఒక మీటను నొక్కితే చాలు, లెన్సు త్రిప్పే ఒక మోటారు ఒకటి సముద్రగర్భంలోని కెమెరాలో పని చేయడం ప్రారంభిస్తుంది. నీటిలో ఉన్న ఈ ప్రసార కెమెరాకు ఒక దిక్సూచిక యంత్రంతో సంబంధం వున్నది. దానినిబట్టి యే దిశనున్న విషయాలు ప్రసారం చేయబడుతున్నాయో తెలియవస్తుంది. ప్రసార కెమెరా

(మిగత ౩౮వ పుటలో)



# ప్రసారం



టెలివిషన్ కెమేరా అమర్చివున్న పరికరాన్ని సముద్ర తలంమీదికి దింపుతూ



టెలివిషన్ కెమేరా ↑

సముద్ర తలాన
టెలివిషన్ కెమేరా →










నా కొక స్నేహితుడొకడు మొన్న నన్ను చూడడానికి వచ్చాడు. ఇంత కాలంగా ఒకసారైనా కలవలేదేమని నేనడిగాను. చిత్రపటాలు తయారుచేసే ఆ మిత్రుడు, తాను చాలా పని వత్తిడిలో ఉండిపోయినందువల్ల కలవలేక పోయినందుకు క్షమించమని అన్నాడు.

"సోవియట్ దేశం యొక్క కొత్త చిత్రపటాన్ని తయారుచేస్తున్నాము," అన్నాడాయన. "యుద్ధం తర్వాత నేను తయారు చేస్తున్న ఆరవ చిత్రపట ప్రతి ఇది." గోడకు వ్రేలాడుతున్న చిత్రపటం దగ్గరకువచ్చి, దానిని జాగ్రత్తగా పరిశీలించాడు. ఒక పెన్సిల్‌ను తీసి యేవో గుర్తులను దానిపైన పెట్టసాగాడు.

"ఇది 1953వ సంవత్సరపు ప్రతి. ఇప్పుడు చాలా మారిపోయింది," అని అన్నాడాయన.

కొన్ని కొత్త పట్టణాలను, గనులను, విద్యుత్‌కేంద్రాలను, నూనెగనులను చిత్రపటం పైన గుర్తుపెట్టి చూపిస్తున్నంతసేపు అతడు, తన వృత్తిపట్ల యెంతో ప్రేమను ప్రకటిస్తూ మాట్లాడసాగాడు....




"గత సంవత్సరపు నూతన నిర్మాణాల్లో నాకు గుర్తున్న కొన్ని మాత్రమే యివి." అంటూ చిత్రపటంపైన గుర్తులు పెట్టడం పూర్తయ్యాక, చెప్పసాగాడు. "గడిచిన ఒక్క సంవత్సరంలోనే మన దేశంలో 800 పైగా పెద్దపారిశ్రామిక నిర్మాణాలు నిర్మింపబడ్డాయి."

"కొత్త సంవత్సరంతోపాటు కొత్త చిత్రపటాలన్నమాట ?"

"ముమ్మాటికీ నిజం" అంటూ చెప్పుకొనిపోసాగాడు చిత్రపటాలను తయారుచేసే నా మిత్రుడు. ఈ సంవత్సరం దేశ చిత్రపటం పైన ప్రత్యక్షం కాబోయే గుర్తులను గురించి మేము చర్చిస్తూ వుంటే, ఆర్థికాభివృద్ధి పథకం యొక్క వివరాలు నాకళ్ళకు కట్టినట్లు అగుపడసాగాయి.

బొగ్గు, లెనిన్ దీనినే పరిశ్రమల యొక్క జీవగర్ర అని అన్నారు. 1957లో సోవియట్ దేశం 446.2 మిలియన్ల టన్నుల బొగ్గును ఉత్పత్తి చేయబోతున్నది. ఈ మొత్తంలో దాదాపు పదోవంతు కొత్త బొగ్గుగనుల నుండి త్రవ్వబడుతుంది.

నా మిత్రుడు దేశ చిత్రపటంపైన నిర్దేశించవలసియున్న అలాంటివాటిలో ఒకటి ఉక్రెయిన్‌లోని దొనెట్స్ బొగ్గుప్రాంతపు పశ్చిమ దిశలో ఉన్నది. రోజుకు 20,000 టన్నుల బొగ్గును ఉత్పత్తిచేయగల కెపాసిటీని కలిగి ఉంటుంది బొగ్గుగని. అనగా దొనెట్స్‌లోని సాధారణ బొగ్గుగనులకంటె ఇరవై రెట్లు కెపా-

# 19 సోవియట్

సిటీని కలిగి వుంటుందన్నమాట. బొగ్గుత్రవ్వకం పనిలోను, దాని రవాణా పనిలోను పూర్తిగా స్వయంచలనక యంత్రాలు ప్రవేశపెట్టబడుతాయి. భూగర్భంలో ఉండే ప్రధాన యంత్రాలు, ఇతర పరికరాలు, ప్రత్యేకమైన టెలివిషన్ సెట్ల సహాయంతో భూమిమీది నుండే "రిమోట్-కంట్రోలు" పద్ధతి ద్వారా నడుపబడుతాయి.

ఓల్గా, ఉరల్స్‌మధ్యగల సువిశాల ప్రాంతంలోని రెండు స్వపరిపాలక రిపబ్లిక్‌లయిన తాతారియా, బష్కిరియాలు ఈ మధ్య పెద్ద నూనె ఉత్పత్తి కేంద్రాలుగా మారాయి. అజర్‌బైజాన్






# లియొనిద్ గ్ర్యాని

లోని ప్రసిద్ధి గాంచిన బాకూ నూనె గనులను కూడా మించిపోయాయి. అక్కడ అభివృద్ధి గొప్పగా కొనసాగుతున్నది. గత సంవత్సరం బష్కీరియాలో ఆరు ప్రాంతాలలో నూనె ఉత్పత్తి ప్రారంభమయింది. ఈ సంవత్సరం మొదటి రెండు మాసాలలో తాతారియాలో యాభై కొత్త నూనెగనులు త్రవ్వబడ్డాయి. ఈ గనులు, సోవియట్ దేశం ఈ సంవత్సరం ఉత్పత్తి చేయబోయే మొత్తం నూనెలో నాలుగవ వంతును ఉత్పత్తి చేయగలవని అంచనా వేయబడుతున్నది.

## 57 లో ...దేశము

మరొక పరిశ్రమ అయిన ఇంజనీరింగ్ విషయం తీసుకొందాము. సైబీరియా, ఓల్గా ప్రాంతం, రష్యన్ సమాఖ్య మధ్యప్రాంతాలు, మధ్య ఆసియా, ఉక్రెయిన్‌లలో వివిధరకాలైన యంత్రాలు, యంత్ర పనిముట్ల ఉత్పత్తి కొరకు కొత్త యంత్రాగారాలు నిర్మింపబడుతున్నాయి. ఈ సంవత్సరం ఆరంభంలో ఓల్గానది తీరంలో వున్న ఉల్యనోవ్స్కలో హెవీ-డ్యూటి మెటల్-కట్టింగ్ మెషీన్-టూల్ యంత్రాగారం ప్రథమ విభాగంలో పని ప్రారంభింప బడింది.

సోవియట్ లోహ పరిశ్రమ దేశ చిత్రపటంలో అనేక కొత్త మార్పులను తీసుకువస్తున్నది. తూర్పున మూడవ లోహ ఉత్పత్తి కేంద్రాన్ని అభివృద్ధి చేయడం పని ఈ సంవత్సరం గూడా కొనసాగింప బడుతుంది. ఆచరణలో ఇది, సైబీరియా, సోవియట్ దూర ప్రాచ్యంతో కూడిన సువిశాల భూభాగాన్ని ఒక నూతన ఆర్థిక ప్రాంతంగా మార్చుతుంది. ఆరవ పంచవర్ష ప్రణాళికలో నిర్దేశింపబడిన కొత్త బ్లాస్ట్ ఫర్నేసులు, ఓపెన్ హెర్త్ ఫర్నేసులు, రోలింగ్ మిల్లులు వొరోషిలోవ్ గ్రాడ్‌లోని పాత యంత్రాగారాలలోను, ఉక్రెయిన్, ఉరల్స్ లోని నిజ్ని—తగిల్‌లలోను, సైబీరియాలోని కుజ్నెత్స్క యంత్రాగారంలోను స్థాపింపబడబోతున్నాయి. చెరిపోవెత్స్ అను ఒక రష్యన్ పట్టణంలో వున్న ఇనుము, ఉక్కు కర్మాగారం రెండవ విభాగం నిర్మాణంగూడా కొనసాగుతున్నది. ఈ నిర్మాణం ద్వారా పశ్చిమోత్తర దిశలో ఇనుము, ఉక్కు పరిశ్రమ బాగా అభివృద్ధిలోకి వస్తుంది. ఈ సంవత్సరం సోవియట్ దేశం దుక్కు ఇనుము ఉత్పత్తిని గతసంవత్సరపు 35.8 మిలియన్ టన్నులనుండి 38.1 మిలియన్ టన్నులకూ, ఉక్కు ఉత్పత్తిని గత సంవత్సరపు 48.6 మిలియన్ టన్నుల నుండి 51.5 మిలియన్ టన్నులకూ పెంపొందించడానికి నిర్ణయించుకొన్నదన్న విషయాన్ని గుర్తుంచుకొనవలసి యున్నది.

అన్ని పరిశ్రమలు ఇంతా యెక్కువగా అభివృద్ధిలోకి రావాలంటే విద్యుచ్ఛక్తి ఉత్పత్తి

| | 1956, 1957 |
|---|---|
| పరికరాల, వ్యయంచలన యాంత్రీకరణకు | 130 |
| వ్యవసాయ యంత్రాలు | 124 |
| ఫోర్జింగ్, స్టాంపింగ్ యంత్రాలకు | 117 |















చిల్లరగానూ సహకార సంస్థలద్వారా వ్యాపారం(వేలమిలియన్ల రూబుల్లలో)




ఆహార పరిశ్రమ (1956కు ప్రతిశతి)




సోవియట్ దేశపు బడ్జెట్ ఆదాయం (ఆదాయ మొత్తాల ప్రతిశతులు)




సోవియట్ దేశ బడ్జెట్ వ్యయం (వ్యయపు మొత్తాల ప్రతిశతులు)




మరింత యెక్కువ కావాలి. గత సంవత్సరం సోవియట్ దేశం 192,000 మిలియన్ కిలో వాట్ గంటల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసింది. సోవియట్ దేశం గత సంవత్సరం సాధించిన సాంవత్సరిక పెరుగుదల బ్రిటన్, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీలు మొత్తంమీద సాధించిన పెరుగుదలను కూడా మించిపోయింది. కాని సోవియట్ దేశంలో పరిశ్రమలకొరకూ, గృహ అవసరాలకొరకు విద్యుచ్ఛక్తి అవసరం ఇంకా యెక్కువ అవుతున్నది. అందువల్ల, ఈ సంవత్సరం ఉత్పత్తి 211,000 మిలియన్ కిలో వాట్ గంటలకంటే యెక్కువ అవుతుంది. అది యేవిధంగా సాధింపబడుతున్నది?

దేశ చిత్రపటాన్ని మరొకసారి చూద్దాము. ఓల్గానదీ తీరంలోవున్న క్యుబిషేవ్ కేంద్రంలో టర్బయిన్‌లు ఒకటితర్వాత మరొకటి స్థాపింపబడుతున్నాయి. ఈ సంవత్సరాంతం లోగా అంచనా వేయబడిన 2.1 మిలియన్ కిలోవాట్ల కెపాసిటీ సాధింపబడుతుంది. ఓల్గా ప్రవాహం పైన మరొక విద్యుత్‌కేంద్రం—సారతోవ్ విద్యుత్‌కేంద్రం—యొక్క నిర్మాణం ప్రారంభింపబడుతుంది. సైబీరియాలోని ఇర్కుట్స్క్, నొవొసిబిర్స్క్ జల విద్యుత్ యంత్రాగారాలు విద్యుదుత్పత్తిని ప్రారంభిస్తాయి.

నా మిత్రుడు చిత్రపటంమీద గుర్తు పెట్టిన మరొక స్థలం నాదృష్టిని ఆకర్షించింది: సైబీరియాలోని యనిసెయ్ నది మధ్య ప్రాంతంలో ఆరు మిలియన్ కిలోవాట్ల కెపాసిటీగల ఒక విద్యుత్ కేంద్రం నిర్మింపబడనున్నది. ఇప్పుడు యూరోపులోకంతా పెద్దదిగా ఉంటున్న క్యుబిషేవ్ విద్యుత్ యంత్రాగారానికి మూడు రెట్లు పెద్దదిగా వుంటుం దిది.

భౌగోళిక స్థలాల పట్టికను యిస్తూ పాఠకుని విసుగెత్తించకుండా, 143 విద్యుత్ కేంద్రాలు నిర్మాణంలోవున్నాయని మాత్రం చెప్పి ఊరుకుంటాను.

సహజంగానే, ఈ సంవత్సరం ప్రణాళిక ప్రకారం ఒక్క భారి పరిశ్రమలు మాత్రమే పెంపొందింప బడడం లేదు. దేశంలోని వివిధ ప్రాంతాల్లో గుడ్డలు, బూట్లు, దుస్తులు, ఆహార పరిశ్రమల యంత్రాగారాలు స్థాపింపబడుతున్నాయి. ఇక్కడ ఒక చిన్న పట్టికను ఇస్తున్నాను: 27 ఆహార ఫ్యాక్టరీలు, 16 పాల ఫ్యాక్టరీలు, 42 పాడిపరిశ్రమల కేంద్రాలు ఈ యేడాది పనిని ప్రారంభిస్తాయి. ఇవన్నీ కూడా పెద్ద పరిశ్రమలే.

జవుళీ పరిశ్రమలో నిర్మాణాలు బాగా కొనసాగుతున్నాయి. ఓల్గానదీతీరంలోని కమ్యుషిన్, సైబీరియాలోని బార్నావుల్, ఉక్రెయిన్‌లోని ఖెర్సన్—ఈ నగరాలు గొప్ప జవుళీ పారిశ్రామిక కేంద్రాలుగా తయారయ్యాయి. ఇక్కడి మిల్లులు ఇంకా విస్తృతం గావింపబడుతున్నాయి. తజికిస్తాన్, బైలో రష్యా, మోల్దావియాలలో కొత్త మిల్లులు స్థాపింపబడుతున్నాయి.

చిత్రపటం ఎంత పెద్దదయినా సరే, దానిలో ఇమడని ఒక కొత్తరకపు నిర్మాణాలు గూడా ఉన్నాయి. అవే నూతనంగా నిర్మింపబడుతున్న గృహాలు. ఇవి దేశమంతటా నగరాలలోను, పట్టణాలలోను నిర్మింపబడుతున్నాయి. ఈ సంవత్సరం యీ పనికొరకు ప్రభుత్వం పెద్ద మొత్తాలను కేటాయించింది. ఈ ఏడాది 46 మిలియన్ల చదరపు మీటర్ల నివాస స్థావరాలు నిర్మింపబడతాయి. అనగా గత సంవత్సరం నిర్మింపబడిన వాటికంటే మూడవవంతు అధికమన్నమాట. బహుశ, 46మిలియన్ చదరపు మీటర్లు అంటే అర్థం చేసుకోవడం కష్టం కావచ్చు. సులభంగా అర్థమయ్యేటట్లు చెప్పాలంటే, ఈ సంవత్స రము నగరాల్లోను, పట్టణాల్లోను నివసించే ప్రజలకు 1.5 మిలియన్ల మూడుగదుల గృహభాగాలు లభిస్తాయి. ఒక్క మాస్కో దానిపరిసరాల్లోనే ప్రజలు ప్రతిరోజు 255 కొత్త గృహభాగాలలో గృహప్రవేశం చేస్తారు....

ఈ సంవత్సరంలో జరిగే అభివృద్ధినంతా ఇంతటి చిన్న వ్యాసంలో తెలియజేయడం కష్టమన్నమాట నిజమే. దేశ ఆర్థికస్థితిని పెంపొందించడానికి, ప్రజల అవసరాలను తీర్చడానికి సోవియట్ దేశంలో చేయబడుతున్న విషయాలను తెలియజేయడానికి అవసరమని మేము భావించిన కొన్ని విషయాలను మాత్రమే తెలియజేశాము.

....మా సంభాషణ పూర్తిఅయిన తర్వాత నేను పెన్సిల్‌తో గుర్తుపెట్టబడిన చిత్రపటాన్ని గోడమీదినుంచి తీసివేశాను. కొత్త చిత్రపటముతో దానిని పోల్చి చూచినప్పుడు తమాషాగా వుంటుంది.

# శ్రేష్ఠమైన ఇనుము

ఎ. లెజెబ్‌నికోవ్



ఛెరెపొవెత్స్ ఇనుము, ఉక్కు కార్మికులకు భారత దేశం నుంచి కానుకగా వచ్చిన వెండి పళ్ళెం

ఛెరెపొవెత్స్, సోవియట్ దేశపు ఉత్తరాదిని వున్న ఒక చిన్ననగరం. కాని యిది యిటీవలవరకూ జానపద వాద్యాలు, అకార్డియన్లకు ఉత్పత్తి స్థానంగా మాత్రమే పేరుకెక్కింది. ఇప్పుడది నవీన సోవియట్ ఇనుము, ఉక్కు పరిశ్రమకు కేంద్రమయ్యింది గత సంవత్సరం ఒక పెద్ద బ్లాస్ట్ ఫర్నెస్ పనిప్రారంభింపబడింది. ఛెరెపొవెత్స్ ఉత్పత్తి చాలా అల్పకాలంలో సోవియట్ దేశంలోనూ, విదేశాలలోనూ కూడా బాగా పేరు పడింది. ఇటీవల ఒక సంతోషవార్త యీ నగరంలో వ్యాపించింది:

"ఇటీవల భారతదేశంనుండి మనకొక కానుక వచ్చింది—ఒక వెండి పళ్లెం. మనం మంచిపోత యినుము తయారు చేసినందుకు కృతజ్ఞతగా అది పంపించారు."

చాలా రోజుల తరవాత నగర వస్తు ప్రదర్శనశాలలోని కొత్త వస్తువును చూడడానికి చాలమంది వెళ్ళారు. ఇనుము, ఉక్కు వస్తు పరిశ్రమ, భారతదేశంనుండి వచ్చిన యీ కానుకను వస్తు ప్రదర్శనశాలకు బహూకరించింది.

ఇప్పుడు మంచు తుఫానులు రేగుతోన్న యీ ఉత్తరాదినగరం యింతగా ఆకర్షణ కేంద్రమైంది ఎందువల్ల ?

ఛెరెపొవెత్స్ పరిశ్రమ కార్యాలయాధిపతికి మేము టెలిఫోను చేశాము. పరిశ్రమ దర్శకుడు యస్. రెస్నికోవ్, భారతదేశంలో ప్రచురింపబడే ఒక పత్రిక సంపాదక కార్యాలయ ప్రతినిధి టెలిఫోను చేస్తున్నాడని తెలుసుకొని సంతోషించారు.

"అవును, నిజమే. మా పరిశ్రమ ప్రాయం పద్దెనిమిది మాసాలు మాత్రమే అయినప్పటికీ, అనుభవంలో మేము చిన్నవాళ్ళమని అనుకోవడంలేదు, మాయినుము ఉత్తమమైనదిగా గుర్తింపబడినందువల్ల."

"సోవియట్ దేశంలోనా ?"

"ఒక్క సోవియట్ దేశంలో మాత్రమే కాదు. భారత దేశం నుండి ఆ కానుకను స్వీకరించిన వెంటనే మాకు స్విట్జర్లాండ్ నుండి ఒక బంగారు వాచీ వచ్చింది. ఇది జరిగి కొద్దిరోజులు మాత్రమే అయ్యింది. ఇనుముకు బంగారం"—దర్శకుని గొంతుకలో మాకు నవ్వు వినిపించింది." లాభసాటి బేరమేకదూ ?"

"ఈ వాచీ యిటీవలనే మాకువచ్చినందువల్ల, దానిని మే మింకా వస్తుప్రదర్శనశాలకు యివ్వలేదు. వస్తుప్రదర్శనశాలలోని మా ప్రదర్శన తావుకు ఛెరెపొవెత్స్‌నగరపు "అంతర్జాతీయ ప్రశంసా స్థానం" అని నామకరణం చేయాలని మేము ఆలోచిస్తున్నాము.

"సోవియట్ ఇనుమును వాడుక చేసే భారతీయ వాడకందారులు కానుకతోబాటుగా యిలా ఉత్తరం వ్రాశారు: "మా అభిప్రాయంలో ప్రపంచం అంతట్లోకీ అతి చక్కని పోత ఇనుమును ఉత్పత్తి చేసే పరిశ్రమకు మా అల్పపారితోషికాన్ని బహూకరిస్తున్నాము."

"భారత దేశపు ఇనుము, ఉక్కు మంత్రిత్వశాఖనుండి సోవియట్ దేశపు ప్రోమ్సుర్యోయంపోర్త్ (పారిశ్రామిక ముడిపదార్థాల దిగుమతి)కి యీ లేఖ, సిద్ధహస్తులు తయారు చేసిన యీ వెండి పళ్ళెమూ మాస్కోకు వచ్చాయి. ఈ సంస్థ అధ్యక్షుడు ఇ. ఓల్చికోవ్—యిది సోవియట్ విదేశ వాణిజ్యమంత్రిత్వశాఖ క్రిందవుంది. యిది భారత దేశంతో చాలా కాలంగా వ్యాపారం చేస్తోంది—సోవియట్ ఎగుమతుల పరిశ్రమలనుండి మమ్మల్ని ఎన్నిక చేశారు."

"ఇంకే దేశాలకు మీరు మీ ఇనుమును పంపుతారు ?"

"బ్రిటన్, స్వీడెన్, ఫిన్లండ్ కూడా ఛెరెపొవెత్స్ ఇనుమును కొంటాయి."

"ఉత్తరాది ఇనుము, ఉక్కు కార్మికుల నిలయమైన మీ నగరము గురించి కాస్త చెబుతారా ?"

"సంతోషం. గత రెండేళ్ళలో సుమారు నూరు కొత్త వీధులు మా నగరంలో నిర్మింపబడ్డాయి. చేతిపనివారి, వెన్నను తయారు చేసేవారి యీ నగరాన్ని మా అధునాతన పరిశ్రమ ఎలా మార్చివేసిందో మీరు సులభంగా ఊహించగలరు. అకార్డియన్ వాద్యకారులకూ, రష్యాలోని ఉత్తమమైన ఒలోగ్దా వెన్నకూ మా నగరం యింకా ఖ్యాతిని పొందుతోంది. కాని వీధులపేర్లు నగరంలోని పరిశ్రమలగురించి తెలియజేస్తాయి: 'ఇనుము, ఉక్కు కార్మికులవీధి, ఎలెక్ట్రిషియన్లవీధి, నిర్మాతల వీధి'. త్వరలో మా నగరం పెద్ద ఓడరేవుగా తయారవుతుందని మీ భారతీయ పాఠకులకు చెప్పడం మర్చిపోకండి. నిర్మించి నూరేళ్ళుదాటిన నీటి సరఫరా నిర్మాణం పునర్నిర్మింపబడుతోంది. నదులపైని ఒక నూతన మార్గం, యిప్పటికే ఐదు సముద్రాలకు రేవు అయిన ఛెరెపొవెత్స్‌ను పెద్ద ఓడలు ఆగే నగరంగా పరివర్తనం గావిస్తుంది. మీరు మా నగరానికి వస్తే సంతోషిస్తాము."

# జయశంకర్ ప్రసాద్ సంస్మరణ: వైజ్ఞానిక సమావేశం

## ఇ. చెలీషెవ్

జయశంకర్ ప్రసాద్ బహుముఖకృషి, భారతీయ సారస్వతాన్ని అధ్యయనం చేసిన సోవియట్ ప్రవీణుల దృష్టి నాకర్షించింది. ఆయన కావ్యాలను పఠించడంలో వారికి భారతీయ సారస్వత విమర్శకుడు రామచంద్ర శుక్ల, హజారీ ప్రసాద్ ద్వివేదీ, కృష్ణకుమార్ సిన్హా, నాగేంద్ర, రవీంద్ర సహాయవర్మ, రాంబిలాస్‌శర్మ, ప్రకాష్ చంద్రగుప్త మున్నగువారు చాలా సాయపడ్డారు.

1957 ఫిబ్రవరి 18న సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు క్రిందనున్న ప్రాచ్యవిద్యాసంస్థ జయశంకర్ ప్రసాద్ రచనలను ఇంకా విస్తృతంగా పఠించేందుకూ, ఆయన రచనలను ప్రజలదృష్టికి తెచ్చేందుకు కూడా ఒక వైజ్ఞానిక సమావేశాన్ని ఏర్పరిచింది. ఇప్పుడు మాస్కోలో వుంటున్న, పనిచేస్తోన్న భారతీయులు, విద్యాసంస్థ ఉద్యోగులు యీ రచయిత సృజనాత్మక కృషికి సంబంధించిన వివిధ హంశాలపైని ప్రసంగించారు.

ఇప్పుడు విదేశీభాషా ప్రచురణాలయంలో పనిచేస్తోన్న డాక్టర్ శుక్లా భారతీయుల జీవితంలో జరిగిన మహత్తర ఘటనలను ప్రతిబింబించే జయశంకర్ ప్రసాద్ నాటకాల గురించి ప్రసంగించారు. "ఆయన నాయకులు కేవలమూ కావ్యవ్యక్తులు కారు, వారు సజీవ వ్యక్తులు, తమకు సహజమైన ఆలోచనలూ, భావాలూ, సందేహాలూ, వైరుధ్యాలూ అన్నిటితో వున్నవారు."

"ప్రసాద్ తాత్త్వికోపదేశంలో నూతన సాంఘిక వ్యవస్థను ఉద్భవింపజేసే పెలుగురవ్వలు కనిపిస్తాయి. నవసంస్కృతీ నిర్మాణానికి సాగిపొమ్మనీ, ఐక్యం కమ్మనీ ఆయన రచనలు ప్రజలను ఉద్బోధిస్తాయి" అన్నారు డాక్టర్ శుక్లా.

డాక్టరు యల్. డి. ఖన్నా—యీయన కూడా విదేశీ భాషా ప్రచురణాలయానికి సంబంధించినవారే—ప్రసాద్ కవిత గురించి ప్రసంగించారు. ప్రధానంగా జయశంకర్ ప్రసాద్ తత్త్వశాస్త్రజ్ఞుడన్న విషయాన్ని నొక్కి చెప్పారు, యిది ఆయన పద్యాలలో ప్రత్యేకంగా స్పష్టమవుతుందన్నారు. ప్రసాద్ సాంప్రదాయకమైన తాత్త్విక సూత్రాలను విడువకుండా, యీ సూత్రాలను అధునాతన జీవితానికీ, తన కాలపు భారతీయ సమాజానికి గొప్ప ఆసక్తిని రేకెత్తించిన సమస్యలకూ వర్తింపజేశారు. ఆయన తాత్త్విక భావాలలో మర్మ, సాంకేతిక భావనలతో జోడింపబడి వాస్తవికత మనకు గోచరమవుతుంది. 'అన్సు' నుండి ఉదహరించి యీ ఉపన్యాసకుడు తన భావాన్ని విశదపర్చారు.

సోవియట్ దేశంలోని భారతీయ రాయబారి కార్యాలయానికి కౌన్సిలర్ భార్య శ్రీమతి కమలారత్నం, జయశంకర్ ప్రసాద్ గురించి ప్రసంగిస్తూ "ఛాయావాదా"న్ని గురించి వివరించారు. ఈ "ఛాయావాదం" ఒక సాహిత్యధోరణి, స్థాపించినది జయశంకర్ ప్రసాద్, భారత దేశంలో యిది 1920–40 లలో బాగా వ్యాప్తిచెందింది.

శ్రీ శ్యామ్ దుబే—యీయన మాస్కో రేడియోకు చెందినవారు—జయశంకర్ ప్రసాద్ రచనలలలో ప్రతిబింబించిన మాతృదేశ ప్రేమగురించి ఉపన్యసించారు. చారిత్రిక నాటకం "స్కందగుప్త" నుండి ఉదహరిస్తూ ఆయన తన ప్రసంగాన్ని ప్రారంభించారు:

సోవియట్ దేశ ప్రాచ్యవిద్యా పరిషత్తు, భారతీయ ప్రసిద్ధ రచ





శ్రీమతి కమలా రత్నం



డాక్టర్ శుక్లా



డాక్టర్ ఎన్. డి. అన్నా

* "మా మాతృభూమికొరకు సర్వదా
జీవించే అవకాశం మా కివ్వండి.
మా మాతృభూమి సర్వదా మాకు గర్వ, ఆనంద
కారణమగు గాక.
మా ప్రియ భారతభూమికొరకు సర్వార్పణ
గావించే అవకాశాన్ని మాకివ్వండి!"

మన శకం ఐదవశతాబ్దంలో హూన్ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా సాగిన వీరోచిత పోరాటం, "తమ విముక్తికొరకు పోరాడమని భారతీయులకొక హెచ్చరిక" అని ఉపన్యాసకుడు ఉద్ఘాటించారు.

జయశంకర్ ప్రసాద్ రచనలకూ 'భారతదేశ స్వాతంత్ర్యోద్యమానిక గల అవినాభావ సంబంధాన్ని వివరిస్తూ యీ ఉద్యమం ఆ రచయిత రచనలపైని ఎలా ప్రభావాన్ని చూపిందో తెలియజేశారు. కొందరు రచయితలు చెప్పేటటువంటి ప్రసాద్ "మర్మవాదం". "సాంకేతవాదం" నిజానికి ఆ రచయిత పద్ధతిలో ఒక భాగంమాత్రమే నని ఆయన చెప్పారు. ప్రసాద్ కవితలోని మర్మ భావాలకూ, సాంకేతాలకూ వెనుక నున్న వాస్తవిక జగత్తును స్పష్టంగా చూడవచ్చును. అందువల్ల యీ రచయిత సృజనాత్మక పద్ధతి వాస్తవికతగాని, మర్మపద్ధతి కాదు.

విదేశ భాషా ప్రచురణాలయంలో యిప్పుడు పనిచేస్తోన్న రచయిత భీషం



శ్రీ భీషం సహాని

సహానీ, హిందీ నవలా సారస్వత పరిణామంలో జయ శంకర్ ప్రసాద్ పాత్రగురించి ప్రసంగించారు. ప్రసాద్ సృజనాత్మక కృషి సాగిన కాలంలోని చారిత్రిక పరిస్థితిని గురించి, ప్రజాభిప్రాయం పెంపుదల, సాంఘిక నిర్మాణాల గురించి ఆయన సంక్షిప్తంగా వివరించి, ఆయన నవలలు "కంకల్", "తితాలీ" భారతీయ ప్రజల జీవితంతో ఎలా అవినాభావ సంబంధం కలిగివున్నవో తెలియజేశారు.

(మిగత 40వ పేజీలో)

---

* "జయేతో సదా ఉసీకే లియే
ఎహ్ అభిమాన్ రహే, హంహర్ష్
విచావర్ కర్దే, హం సర్వస్వ
హమారా ప్యారా భారత్ వర్ష్!"

...ద్ సంస్మరణార్థం జరిపిన వైజ్ఞానిక సమావేశం



# సోవియట్ దేశంలో కార్మిక వివాదాలు ఏవిధంగా పరిష్కరింపబడుతాయి

సోవియట్ దేశంలో కార్మిక వివాదాలు యేవిధంగా పరిష్కరింపబడుతాయి అని శ్రీ మోహన్ సింగ్ అహ్లూవాలా, జలంధర్, "సోవియట్ భూమి" పత్రికను ప్రశ్నించారు. పత్రికా సంపాదకులు, మాస్కో ఆటో రిఫ్రిజిరేటర్ యంత్రాగారం న్యాయ సలహాదారిణి ఎల్. త్రాఖ్టెన్‌గెర్ట్స్‌ను, తాను యంత్రాగారంలో పొందిన అనుభవాలను ఉదాహరణగా ఇస్తూ, ఈ ప్రశ్నకు సమాధానమివ్వమని కోరారు. అది యిక్కడ ప్రచురింప బడుతోంది.

యల్. త్రాఖ్టెన్‌గెర్ట్స్

యంత్రాగార న్యాయ సలహాదారులినిగా నేను యంత్రాగార నిర్వాహకులకు, కార్మికులకు మధ్య వచ్చే కార్మిక వివాదాలను పరిష్కరించడంలో స్వయంగా పాల్గొంటాను

కార్మికునికీ, ఆతని అధికారికీ మధ్య వచ్చే ప్రతి విభేదము కార్మిక వివాదముకాదు. సాధారణంగా అలాంటి యంత్రాగార నిర్వాహకుల చేతనే విజయవంతంగా పరిష్కరింపబడుతాయి. కార్మికుల కోర్కెలను అంగీకరింపజాలమని నిర్వాహకులు భావించినప్పుడు, నిర్వాహకులు కోరినవాటిని జరుపుటకు కార్మికులు నిశ్చితంగా నిరాకరించినప్పుడు మాత్రమే, ఆ సమస్య పరిష్కారం కొరకు ప్రత్యేక అధికార సంఘానికి పంపబడుతుంది.

ప్రతి యంత్రాగారంలోను, సంస్థలోను వుండే కార్మిక వివాదాల కమీషన్లు ఇలాంటి అధికార సంఘాలలో ప్రాథమిక మయినవి. ఈ కమీషన్లలో యంత్రాగార నిర్వాహకులకు, కార్మికులకు చెందిన ప్రతినిధులు సరిసమానమైన సంఖ్యలో వుంటారు. ఇరుపక్షాలవారు—నిర్వాహకులు, కార్మిక ప్రతినిధులు—అంగీకారానికి వచ్చినట్లయితే నిర్ణయం తీసుకొనబడుతుంది.

నా అనుభవంలోని ఒక విషయాన్ని మీకు ఉదాహరణగా తెలియజేస్తాను ప్రసూతి సెలవుకు ముందు కారు డ్రైవరుగా నియమింపబడిన ఒక స్త్రీకి సంబంధించిన వివాదాన్ని మా యంత్రాగార కార్మిక వివాదాల కమీషన్ ఒకసారి పరిశీలించడం జరిగింది. (ప్రసూతి సెలవు సుమారు నాలుగు నెలల పాటు వుంటుంది) తన సెలవు తర్వాత యంత్రాగారానికి తిరిగివచ్చాక ఆమె సార్టర్‌గా పనిచేయ నారంభించింది ఈ పనిలో వుంటే ఆమెకు, బిడ్డకు పాలివ్వడానికి అప్పుడప్పుడు వెళ్ళేందుకు అవకాశం కలుగుతుంది. మా న్యాయచట్టం ప్రకారం బిడ్డలకు పాలిచ్చే తల్లులకు పనిచేసే కాలం తక్కువగా వుంటుంది. పిల్లలకు పాలివ్వడానికి ప్రత్యేకించి కొన్ని సమయాల్లో పనిలోంచి బయటికి వెళ్ళడానికి అనుమతికూడా ఇవ్వబడుతుంది

కాని సార్టర్ వేతనం, కారుడ్రైవర్ వేతనం కంటే తక్కువ. తన బిడ్డకు పాలిచ్చి పోషిస్తున్నంత కాలం పూర్వపు వేతనాన్నే ఇవ్వాలని ఆమె కోరింది. నిర్వాహకులు అందుకు నిరాకరించారు ఆమె కార్మిక వివాదాల కమీషన్‌కు అప్పీలుచేసుకొన్నది. యంత్రాగార కార్మిక సంఘంయొక్క కమిటి ప్రతినిధి అఖిల సోవియట్ దేశ కార్మిక సంఘాల కేంద్ర కమిటీ కార్యనిర్వాహక వర్గం 1950 డిసెంబరు 22వ తేది సమావేశంలో చేసిన నిర్ణయాన్ని వినడానికి హాజరయ్యాడు. పిల్లలకు పాలిచ్చిపోషణ జరుపు తున్నప్పుడు యితర పనులలోకి మార్చబడిన స్త్రీలకు వారి పూర్వపు పనియొక్క వేతనాలే యివ్వబడాలని ఆకమీషన్ వివరించింది. ఆ స్త్రీకి డ్రైవర్‌కు ఇవ్వవలసిన వేతనమే ఇవ్వాలని ఉభయపక్షాలు అంగీకారానికి వచ్చాయి. గడిచిన కాలానికి, రెండు వేతనాలకు మధ్య వుండే తేడా మొత్తం చెల్లింపబడాలనికూడా అంగీకరింప బడింది



యల్. త్రాఖ్టెన్‌గెర్ట్స్

ఒకవేళ ఉభయపక్షాలు అంగీకారానికి రాలేకపోయినా, లేక ఆ స్త్రీ కమీషన్‌యొక్క నిర్ణయంతో సంతృప్తి చెంది యుండక పోయినా యేమి జరిగి వుండేది ?

అలాంటి సందర్భంలో ఆమె ఉన్నత సంఘమయిన, యంత్రాగార కార్మిక సంఘంయొక్క కమిటి దరఖాస్తు పెట్టుకుంటుంది యంత్రాగారం కార్మికుల సర్వసభ్య సమావేశం ఎన్నుకున్న కార్మిక ప్రతినిధులు మాత్రమే యీ కమిటీలో వుంటారు.

ఎవరైనా ఒక కార్మికుడు కార్మిక సంఘం కమిటీ నిర్ణయంతో అంగీకరించక పోయినట్లయితే అతడు ప్రజాకోర్టుకు అపీలు చేసుకొనవచ్చును నిర్వాహకులకు గూడా ఇదే హక్కు వుంటుంది. యంత్రాగార కార్మిక సంఘముయొక్క కమిటీ నిర్ణయం ఇతర అధికార సంఘాల నిర్ణయం వలెనే శిరోధర్యం

వివాదాల విషయంలో కోర్టు వ్యవహారాలు యేవిధంగా కొనసాగుతాయో చెప్పడానికి, ఎప్పుడూ పనిలోకి ఆలశ్యంగా వస్తూ వుండిన ఒక కార్మికుని కేసును ఉదాహరణకు యివ్వవచ్చును. ప్రారంభంలో నిర్వాహకులు ఆ కార్మికుని హెచ్చరించారు ఆటుతర్వాత కొన్ని రోజులవరకు అతడు సకాలానికి పనిలోకి వస్తుండేవాడు కాని మళ్ళీ ఆతడు రెండు

(మిగత 38వ పుటలో)

# 1957లో ఆసియా

ఎ. ఝుకోవ్*

చరిత్ర నానాటికీ అధికతర వేగంతో పురోగమిస్తుందనడానికి, ప్రతి సంవత్సరమూ అదనపు సాక్ష్యాన్నిస్తుంది. 1956 లో ఆసియా, ఉత్తరాఫ్రికా దేశాలలో రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక పురోగతి ఫలితాలను ఎవరైనా తనలో తాను సమీక్షించుకున్నట్టయితే, సంఘటనల సత్వరగతిని అప్రయత్నంగా గ్రహించగలరు. అనేక నూతన సార్వభౌమ దేశాలు—మొరాక్కో, ట్యునిస్, సుడాన్—ఆ ఒక్క ఏడాదిలోనే ఉత్తరాఫ్రికాలో ఆవిర్భవించాయి. ఆసియాలోని మహత్తర దేశాలైన చైనా, భారతదేశాలు తమ ఆర్థిక వ్యవస్థలలోనూ, సంస్కృతులలోనూ బ్రహ్మాండంగా అభ్యుదయాన్ని సాధించాయి. వలసరాజ్యాల ప్రతిష్ఠకు మున్నెన్నడూ తగలనంత గట్టి దెబ్బలు తగిలాయి. ఈ వలసరాజ్యాలు ప్రాచ్య దేశాల జాతీయ విముక్తి, పునరుజ్జీవన క్రమాన్ని—యీ సహజమైన, అనివార్యమైన క్రమాన్ని అరికట్టడానికి ప్రయత్నించి విఫలమయ్యాయి.



1957లో కూడా ఆసియాలో చారిత్రిక పరిణామపు అపారగతి హెచ్చుతుందనడానికి సందేహం లేదు. ప్రజా సమూహాలు కదలడం మొదలుపెట్టాయి, మేలుకొన్నవారి శక్తి అభ్యుదయకరమైన పరివర్తనలను తీసుక వస్తుంది. అపూర్వగతిలో స్వతంత్ర ఆసియా దేశాల జీవితంలో ఆర్థిక వ్యవస్థలలో, సంస్కృతులలో. సాధింపబడిన అతి నవీనమైన వైజ్ఞానిక, ఇంజినీరింగ్ విజయాలతో, ఆశియా దేశాల కోట్లాది మంది ప్రజలు వాటిని అనుభవిస్తోంటే, ప్రకృతిపైని మానవుని విజయావకాశం అనేకరెట్లు పెరుగుతుంది, యావత్తు మానవజాతి ఎదుట కొత్త పుంతలు కానవస్తాయి.

ఒకనాడు ఆసియా మానవ సంస్కృతికి—నైతిక, భౌతిక సంస్కృతులు రెంటికీ—పుట్టినిల్లని అందరికీ బాగా తెలుసును. ఎన్నో శతాబ్దాల క్రితం నాగరికతా వ్యాప్తికి ఆసియా చేసిన గొప్ప సేవకు తార్కాణాలుగా వున్న గతకాలపు స్మృతి చిహ్నాలను అన్ని దేశాలూ కృతజ్ఞతతోనూ, ప్రశంసాభావంతోనూ భద్రపరచుకుంటున్నాయి. ప్రాచ్యఖండపు మహోతాత్త్వికులు, వాస్తు శిల్పులు, కవులు, విజ్ఞానులూ వాడిపోని, వాసన వీడిపోని తమ రచనలతో అమరులయ్యారు.

కాని ఆ తరవాత ఎక్కువ ఆసియాదేశాలలో నిస్తబ్ధత, పతనమూ దీర్ఘకాలంగా సాగాయి. వాటి సాంస్కృతికాభివృద్ధి కుంటుబడింది, వాటి అభ్యుదయకరమైన ప్రభావం నీరసపడింది. అభ్యుదయానికి ఒకనాడు చిహ్నమైన "ప్రాచ్యఖండం", "వెనుకబాటుతనా"నికి, మందకొడితనానికి యిప్పుడు పర్యాయపదమైంది. మూడు, నాలుగు శతాబ్దాలలో ఆసియా ప్రజలు మొదట తమ నాయక పాత్రను, తరవాత తమ స్వాతంత్ర్యాన్ని నష్టపోయారు. కొన్ని యూరోపియన్ రాజ్యాల వలసరాజ్య తృష్ణకు ప్రాచ్య ఖండం గురి అయ్యింది. ఆసియా ప్రజల సృజనాత్మక భావాలు విచ్ఛిన్నమైనట్టుగా కనిపించాయి; దాస్యంలోవుండగా ఏ ప్రజ తమ శక్తి సామర్థ్యాలను ప్రకటించలేదు గదా.

ప్రాచ్యఖండ మాంద్యం, వలస ప్రభువులు ప్రచారంచేసిన ఆసియాకు "అంతర్గతంగా వున్న వెనుకబాటుతనం" గురించి, "శ్వేతజాతుల భారం" మొదలైనవాటి గురించి అనేక కట్టుకథలకు కారణమైంది.

చరిత్రగతిలో యిదంతా తలక్రిందులైంది, ఇప్పుడు మన కళ్ళ యెదుట సాగుతోన్న వలస విధాన పతనం, మానవజాతులను, దేశాలలో "క్రియాశీలక", "క్రియారహిత" జాతులు, దేశాలుగా విభజించే తప్పుడు, అశాస్త్రీయ విభజనను తుదముట్టించింది. ఆసియా, ఆఫ్రికా ఖండాలలో స్వతంత్ర జాతీయ రాజ్యాల ఆవిర్భావమూ, అవి బలపడడమూ ప్రాచ్యఖండ దేశాల అపూర్వమైన నూతన సృజనాత్మక భావ విజృంభణకూ, ప్రబుద్ధ శక్తికీ దారితీశాయి. కాని యిప్పటివరకూ పూర్తిగా పెకలింపబడని సుదీర్ఘ వలస పీడనావళి, తన జాడలను వదలక తప్పలేదు. పెట్టుబడిదారీ పాశ్చాత్య ఖండం తన భౌతిక సంస్కృతి అభివృద్ధిలో, ముఖ్యంగా టెక్నిక్స్ అభివృద్ధిలో చాలా ముందుకు పోయింది.

అంత్యత అల్పచారిత్రిక కాలంలో యీ వెనుకబాటుతనం నుండి బయటపడడం, ఆసియా ప్రజల ఎదుట చరిత్ర ఉంచిన కర్తవ్యం. ఇది సామాన్యమైన కర్తవ్యంకాదు, మునుపటి వలస 'ప్రభువులు' అభివృద్ధి చెందిన, ఆర్థికంగా అభివృద్ధి చెందని దేశాలు అనబడే వాటిమధ్యగల హెచ్చుతగ్గులను తొలగించకుండా శాయశక్తులా ప్రయత్నిస్తారు గాబట్టి.

అయినా, తమ అభివృద్ధిని త్వరితగతిలో సాధించుకునేందుకు నానాటికి శక్తినిపొందే సాధనం ఆసియా ప్రజల చేతిలోనికి వచ్చింది. ఈ సాధనం, వారి జాతీయ స్వాతంత్ర్యం.

ఆర్థిక స్వయంపోషకత్వం కొరకూ తమ కృషిలోనూ, జాతీయ పరిశ్రమలను, అభివృద్ధిచెందిన వ్యవసాయాన్ని పెంపొందించుకొనడంలోనూ, 1957లో ఆసియా జాతీయ రాజ్యాలు గణనీయమైన కొత్త విజయాలను సాధించుకుంటాయని జోస్యం

(మిగత 40వ పేజీలో)

*ఈ వ్యాసకర్త ఎ.ఝుకోవ్, డాక్టర్ ఆఫ్ హిస్టరీ, సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు కరస్పాండింగ్ సభ్యుడు, పది సంపుటాల "ప్రపంచ చరిత్ర"కు ప్రధాన సంపాదకుడు

# "రోమెన్"

ఐ. ల్యుబిన్‌స్కి
(నాటకకర్త, జిప్సీ నాటకశాల సాహిత్య శాఖవ్యవహర్త)

మాస్కో జిప్సీ నాటక సమాజాన్ని గురించి వ్రాయాలంటే యెన్ని రీముల కాగితమయినా పడుతుంది. ఇలాంటి నాటక సమాజం ప్రపంచంలో మరేదీ లేదు. దాని చరిత్ర, పాతిక సంవత్సరాల కాలంలో అది సాధించిన సృజనాత్మక పరిపక్వత, ప్రావీణ్యత, నాటకాల సేకరణలో అది యెదుర్కొన్న సమస్యలు, నటకుల జీవిత చరిత్రలు చాలా అసాధారణమైనవి.

ఒక చిన్న జిప్సీ జానపద గాయకుల, నృత్యకారుల జట్టునుండి రూపొందిన ఈ విశిష్ట జిప్సీ నాటక సమాజము, రోమెణా జాతీయ సంప్రదాయంయొక్క మౌలికత్వం కారణంగానే, సోవియట్ ప్రేక్షకుల మనస్సులను, విదేశాలలో వున్న మిత్రుల మనస్సులను సదా చూరగొంటున్నది.

ఇక అప్పటి నాటకాలను గురించి చెప్పాలంటే, కాలంయొక్క పరీక్షకు నిలిచి తట్టుకొనగల నాటకాలు చాలా తక్కువగా వున్నాయని, పది, పన్నెండు సంవత్సరాలక్రితం విమర్శకులు అభిప్రాయపడుతూ వుండేవారని చెప్పవలసి వుంటుంది. ఆ రోజుల్లో నాటక సమాజాలు జానపదగాథలు, లేదా విప్లవానికి పూర్వపు రష్యన్ జీవితంపైన ఆధారపడిన నాటకాలను, పుష్కిన్, గోర్కీ, లెస్కోవ్, కుప్రిన్‌ల రచనలు ఆధారంగా వ్రాయబడిన నాటకాలను మాత్రమే ప్రదర్శిస్తుండేవి.

ఈ నాటకాల్లో అనేకవాటిని ఈ నాటక సమాజంవారు ఇప్పటికిగూడా ప్రదర్శిస్తున్నారు. ఎన్. లెస్కోవ్‌యొక్క రచన "మంత్రముగ్ధుడయిన దేశదిమ్మరి" ఆధారంగా తయారుచేసిన "గ్రుషెన్కా" అను నాటకం త్వరలో వెయ్యవ పర్యాయం ప్రదర్శింపబడబోతున్నది. కాని రోమెణా నాటక సమాజము యీ పాత నాటకాలతోనే కాలం వెళ్ళబుచ్చుతున్నదనుకోవానికి వీల్లేదు. ప్రస్తుత విషయాలకు సంబంధించిన నాటకాలను కూడా వేస్తూవచ్చింది. వీటిలో సోవియట్ దేశ జీవితానికి, విదేశాల జీవితానికీ సంబంధించిన నాటకాలు వున్నాయి. ఉదాహరణకు, రోమ్-లెబెదేవ్ నాటకం "శిబిరంవారి పుత్రిక" ఫాసిస్టులకు వ్యతిరేకంగా యుగోస్లావ్ గెరిల్లాలు జరిపినపోరాటంలో జిప్సీలు నిర్వహించిన పాత్రను చిత్రిస్తుంది. ఈ వ్యాసకర్త వ్రాసిన "పట్టుదల గలవారు" అన్న నాటకం, జిప్సీలు యేవిధంగా మాస్కో సమీపంలోవున్న బొగ్గుగని దగ్గిర స్థిరపడ్డారో తెలియజేస్తుంది. విక్టర్ హ్యూగో నవల "నాటర్‌డామ్ గూనివాడు"ను ఆధారంగా తీసుకొని సిద్ధంచేసిన నాటకము, స్పానిష్ విప్లవ నాటక రచయిత గార్సియా లోర్కా నాటకాలు, హంగేరియన్ నాటక సమాజాలవారు మాకొరకు తయారుచేసిన హంగేరియన్ రచయిత ఎడీ స్జిగ్లిగెతీయొక్క హాస్యనాటిక "జిప్సీలు", భారతీయ రచయిత బల్వంత్ గార్గి వ్రాసిన "సోనీ-మహివాల్"అను నాటకం, ఈ నాటక సమాజంవారు వేసే నాటకాలలో ప్రధానమైనవి.

బల్వంత్ గార్గి నాటకంయొక్క కథ ఆసక్తిజనకంగాను,

"శిబిరం వారి పుత్రిక" అనే నాటకం ఒక దృశ్యం.



ల్యూబా వ్యాసిల్యోవా "జిప్సీ అజా" అనే నాటకంలో

ప్రబోధాత్మకంగా కూడా వుంటుంది. కొన్ని సంవత్సరాల క్రితం మాస్కోను సందర్శించిన ఒక భారతీయ సినిమావ్యక్తుల ప్రతినిధివర్గంలో సభ్యుడుగా వచ్చిన బల్వంత్‌గార్గీ, రోమన్ నాటక సమాజం వారు వేసిన ఒక నాటకాన్ని చూడడం తటస్థించింది. అప్పుడు ఆ



భారతీయ రచయితలు అలీ సర్దార్ జఫ్రీ, అహమ్మద్ అబ్బాస్ జిప్సీ నాటకశాల నటీనటుల సందర్శిస్తూ

నాటక సమాజం నటులతో ఆయనకు పరిచయం ఏర్పడింది. ఆ అవకాశాన్ని తీసుకొని ఆ నటులు, మా రష్యన్ జిప్సీల ఆది స్థానమయిన భారత దేశానికి సంబంధించిన ఒకనాటకాన్ని వేయాలని తాము ఎంతగానో కుతూహల పడుతున్నామని తెలియజేశారు.

ఒక సంవత్సరం తర్వాత, తాను "సోనీ-మహివాల్" అను చిత్రానికి వ్రాసిన స్క్రిప్టు ఆధారంగా మాకు నాటకాన్ని తయారుచేసి ఇస్తానని బల్వంత్ గార్గీ తెలియ జేసినప్పుడు మా ఆనందానికి అంతులేకపోయింది. యురి స్మిర్నోవా, అలెగ్జాండర్ అంతొకోల్స్కీలు అనువదించి, నాటకరంగం కొరకు ఎడిట్ చేసిన ఈ నాటకం ప్రదర్శనకొరకు రోమెన్ నాటకసమాజం వారిచేత అంగీకరింప బడింది.

మేము వేసే నాటకాల్లో సోవియట్ "జిప్సీ"ల జీవితాన్ని చిత్రించే నాటకాలుగూడా వున్నాయని వేరే చెప్పనవసరంలేదు. "జిప్సీలు కదలిపోతుంటే...." అన్నది అలాంటి ఒక నాటకం. దేశద్రిమ్మరులుగా తిరుగుతూవుండిన "జిప్సీ"జట్ల అవశేషాలను గురించి హాస్యాత్మకంగా మా నటులలో ఒకరైన నికొలాయ్ నరోజ్నీ వ్రాసిన నాటకమిది. ఇప్పుడు మాకు సోవియట్ నాటక రచయితలు ప్రస్తుత విషయాలపైన నాటకాలను వ్రాసి పెడుతున్నారు.

రోమెన్ నాటక సమాజము దానియొక్క-రూపం, నవ్యత, సహజత్వం, ప్రేక్షక ఆకర్షణ, సంగీతం, నృత్యాలు మొదలైనవాటి విషయంలో ప్రత్యేకతను పొందింది.

ఈ నాటకాల్లో సంగీతము, పాటలు, నృత్యాలు నాటకపాత్రల హావ భావాలను వెల్లడించేవిగా, నాటకాలతో అవినాభావ సంబంధాన్ని కలిగివుంటూ, వాటితో అల్లుకొనిపోయి వుంటాయి.

నాటకాలను ప్రదర్శిస్తున్నప్పుడు మా నటకులు ల్యాల్యా చోర్నయా, ఓల్గా యానోవ్స్కయా, సెర్జి షిషోకవ్, నికొలాయ్ స్లించెంకో, నదెజ్డా మిహాయిలోవావాటికి జీవాన్ని పోసి మనల్ని మైమరిపిస్తారు. ప్రముఖ యువక నటులలో ఒకతె అయిన సుందరి ఓల్గా పెత్రోవా విషయంలోగూడా ఇది నిజం. ఆమె నృత్యాలు అత్యద్భుతంగా వుంటాయి.

రోమెన్ నాటక సమాజము ఒక పాఠశాలగా కూడా పని చేస్తుండడం మూలాన ప్రత్యేకతను

(మిగత 40వ పుటలో)



రష్యన్ సమాఖ్య విశిష్ట కళాకారిణి యం. స్కొవ్రోన్స్కావా (పైని) వృద్ధ నటీమణులలో ఒకర్తె



"గ్రుషెన్కా" అనే నాటకంలోని ఒక దృశ్యం. ప్రసిద్ధ నటి ల్యాల్యా చర్నయా నాయిక పాత్రధారిణి

# మిత్ర హృదయం

## ఇ. కజకెవిచ్

జీవితపు విజయం, వీరుల అమృతత్వం—ఇ కజకెవిచ్ రచించిన, మాస్కో విదేశ భాషా ప్రచురణాలయం ప్రకటించిన "మిత్ర హృదయం" అన్న ఈ బృహత్కథకు ఇతివృత్తమైనాయి. ఇందలి నాయకుడు, దేశ విముక్తికై సాగిన పోరాటంలో అసువుల కోల్పోయిన అఖిమోవ్‌ను గురించిన నార్వే ప్రజల జ్ఞాపకాలలోనుంచీ, ఆ వీర పత్ని, ఆ వీరుని చిన్న కుమార్తె హృదయాలలో హత్తుకున్న ప్రతి రూపులనుంచీ ఆకృతి దిద్దుకుంటాడు. ఆయన వాళ్ళను రక్షించాడు, తన విశాల హృదయాన్ని, ప్రపంచ ప్రజల మిత్ర హృదయాన్ని వాళ్ళకు సమర్పించాడు.

ఆ బృహత్కథలో నుంచి ఒక ఖండికను ఇక్కడ ప్రకటిస్తున్నాము. ప్రచండ సంగ్రామం సాగుతున్న రోజులలో, సమర ముఖాన వుండగా, సైనిక దళాధిపతి అఖిమోవ్, ఆయన అనువాదకురాలు అనిఛ్కా ఒకరినొకరు ప్రేమించుకొన్నారు. ఇక్కడినుంచి మరొక యుద్ధరంగానికి తను మార్చబడినట్టూ, తన స్థానంలోకి మరో కొత్త కమాండర్ రానున్నట్టూ హఠాత్తుగా తెలిసింది అఖిమోవ్‌కు.

ఆచ్ఛాదితమైవున్న అఖిమోవ్ ముఖపై ఖరినిబట్టే అనిఛ్కా సంగతేమిటో అర్థం చేసుకొన్నది

"ఆయన వచ్చారా ?" అని అడిగింది ఆవిడ.

"అవును."

"దాగుందా" అన్నదామె, అతనిచెయ్యి పట్టుకుంటూ "బాధపడడంకన్నా ఎట్లాగో కొంత దానిని మరచిపోయి, ఉల్లాసంగా వుందాం. ఆరు నెలలైతేనేం, సంవత్సరమైతేనేం, మనకు! నాకు మీరంటే ఎంతో ప్రేమ, ప్రియా అది మీరెరుగుదురా ?"—ఆమె తన ప్రేమను ఇంత బహిర్గతంగా చెప్పడం ఇదే మొట్టమొదటిసారి. "ఈ ఒక్క ముక్క చాలనుకుంటాను మీకు ?"

కాదు, ఆ ఒక్క ముక్కతో ఏమవుతుంది అతనికి ? అతననుకుంది ఆవిడను తనతోపాటు తీసుకెళ్ళాలని, ఆమెను ఓ అగ్గిపెట్టెలో పెట్టేసుకొని, రెండో కంటివాడికి తెలియకుండా తీసుకవెళ్ళ గలిగేట్టయితే అతనికి అంత సంతృప్తి కలిగేది.

ఇద్దరూ కలిసి ఆయన స్వగ్రామానికి వెళ్ళారు; ఆ సైనికుడుంటున్న ఇంటికి వెళ్ళారు.

ఓవర్ కోట్లు విప్పేసి, పొయ్యి పక్కన కూర్చున్నారు ఇద్దరూ. ఆయన సామానంతా ఆవిడ చక్కగా పెట్టెల్లో సర్దేసింది. ఆ తర్వాత ఇద్దరూ మళ్ళీ పొయ్యిప్రక్కన కూర్చున్నారు. ఎవ్వరూ పెదిమ మెదపడంలేదు. పలుకులేకున్నా ఒకరి చూపులు ఇంకొకర్ని పరామర్శిస్తున్నాయి. భోజనాలు చేసి ఇద్దరూ వాహ్యాళి కెళ్ళారు. కొంతతిరిగి మళ్ళీ ఇల్లు చేరుకున్నారు. ఇంటి కొచ్చాక ఆవిడ మళ్ళీ బయటకు వెళ్ళి వచ్చింది. ఇంట్లోకి అడుగు పెట్టడంతోటే, బల్లముందర అతను తల వ్రేళ్ళాడేసుకొని కూర్చునివుంటం, సరిగ్గా రెమిజోవ్ చంపివేయబడ్డాక విచారంతో కూర్చున్నట్టు కూర్చోవటం చూచింది.

అతనికి ఏమాత్రం అవరోధం కలగకుండా ఆవిడ మెల్లగా వెళ్ళి అతనిపక్క పరచింది పక్క పరుస్తున్నప్పుడు దుప్పట్లు విదలుస్తున్న చప్పుడు అతనికి వినిపించింది. అతనికి దీపంపెడ్తే బాగుండననిపించింది, అప్పటికే చీకటి పడుతున్నది. దీపం పెట్టబోతే 'మీరెందుకు ?' అన్నది ఆమె.

"మీరు పోయి పడుకోండి," అన్నది, "నేను ఈరాత్రి మీతో పాటే వుంటా, పోవాలని లేదు."

ఆశ్చర్య పడ్డట్టు కనిపించా డతను.

"మీరెందుకు అట్లా విస్తుపోవడం.....ఇందుట్లో ఆశ్చర్య పడాల్సిం దేముంది గనక ?—ఏమంటారు మీరు ?" అని అడిగిందావిడ కొంత ప్రశ్నాసూచ్యంగా.

ఆ చీకటి గుయ్యారంలోంచి ఎక్కడినుంచో ఆవిడ గొంతు సన్నగా వినిపించింది.

"నేను దేనికీ వెరవడం లేదు. నాకు మీరూ, మీకూ నేనూ, విన్నారా ?"

ఇట్లాంటి మాటలు ఇంతకు మునుపు అని ఛ్కాకే కటువనిపించేవి. ఇవ్వాళయితే, ఆవిడ ఆ మాటలు అంటున్నప్పుడు వాటికో ఉద్విగ్నత, అర్థపటిమ, భావ శబలత వున్నట్టు. అచ్చం అప్పుడే ఆవిడ వాటిని మూసపోసి తీసినట్టు అనిపించింది. ప్రపంచంలో ఇంతకు పూర్వం ఎవరూ వాటిని ఉచ్చరించలేదన్నట్టు, అవి అనాఘ్రాత పుష్పాలలా కొత్తగా వున్నట్టూఆవిడ భావించుకొన్నది.

అతను ఆవిడను తన కౌగిటలోకి తీసుకున్నాడు. ఆవిడను తన చేతులలోకి తీసుకుండడాన్ని ఆవిడ అంగీకరించినప్పుడు అతని గుండె మంచులా గడ్డకట్టుకపోయింది. మరీ ఆవిడ అనుభూతి అతన్ని కలతపెట్టింది ఆవిడ ఎందుకో కన్నీటిపర్యంతమైంది ఎట్లా తన బాధానుభూతిని వ్యక్తీకరించాలో ఆవిడకు అర్థం కాలేదు : "ఇదివరకెప్పుడూ ఈపని చెయ్యలేదు" అన్నది. ఆవిడపట్ల క్షణమాత్రం అతనికి కలిగిన హేయమైన అవిశ్వాసానికి అతను ఎంతో ఇద్దైనాడు, అతని గుండె ఎంతో ద్రవించింది, అతనికి ఇటువంటి అనుభవం ఇంతకు ముందెన్నడూ కలుగలేదు. మోహవివశుడై వున్నప్పుడు కూడా, అతను ఆవిడ బాధను గుర్తించ గలిగాడు. ఆ బాధ ఒక రకంగా ఆత్మార్పణవల్ల కలిగే తియ్యటి బాధ అనుకున్నాడు.

రెప్పపాటు లేకుండా అతడు ఆవిడవంక చూస్తున్నాడు. ఆ అపూర్వత, అతనికి ఒక గర్వకారణమైంది. "నిజానికి నేను కలగన్నది ఈవిడ్నే. అనిఛ్కా. ఇంకా నేను స్వప్నంలోనే వున్నానా ?" అనుకొన్నాడు.

ఆవిడ, అతన్ని గాఢంగా హత్తుకున్నది. అతని ప్రక్కన కూర్చోవడంకన్న, ఆవిడకు ప్రియతమమైన ఆలోచన మరొకటి తోచలేదు, ప్రజలు అతిముఖ్యమైందనుకొనేది అంత ముఖ్యమైంది కాకపోవచ్చు. బహుశా అది క్లిష్టమైందీ, అగమ్యగోచరమైందీ కావొచ్చు.

ఆనాటి రాత్రి తర్వాత, ఇద్దరూ అయిదురోజులు గడిపారు. అతనికి యింక పోక తప్పదు. హీన్‌చేత విరచించబడి, వ్యాగ్నర్ స్వరకల్పన చేసిన జర్మన్ పురాణ గాథలోని నాయకుడు తాన్హాసెర్, సౌందర్య దేవతను విడిచిపెట్టి పోలేని విరహావస్థలాంటి సంకటంలో సరిగ్గా అతను చిక్కుకున్నాడు. సాహిత్యపరమైన ఈ సాదృశ్యం సరిగ్గా అనిఛ్కాకు అతికినట్టనిపించింది. దానివల్ల ఆవిడ ఎంతో ఆనందించింది, వాళ్ళ ప్రేమ అలాగే నిష్కళంకమైంది, అహానమైంది, ఆ కథలో లాగా ఈ ఘటన అగోచర పర్వత సాను

పులపై జరగక ఏదో ఒక కుటీరంలో జరిగినప్పటికీ ఈ పోలిక ఏ మాత్రం తీసిపోదు.

అప్పటికి అయిదురోజులు గడిచి, ఆరవరోజున తెలతెల వారుతున్నది. అకిమోవ్ తొందరగా మేల్కొన్నాడు. నిద్రపోతున్న అనిచ్కా ముఖారవిందాన్ని ఒకసారి చూచాడు. గబగబా యిల్లు వదిలి, ఒక కార్లో తిరిగి వచ్చాడు. ఇంతలో అక్కడ అవరించుకున్న నిశ్శబ్దతలో అనిచ్కా తన దుస్తులు మార్చుకున్నది. ఇద్దరూ స్టేషన్‌కు పోతున్నారు కార్లో. స్టేషన్ దగ్గరకొచ్చి కారాగింది. ఇంతలో అకిమోవ్ డ్రైవర్ని కారు ఊళ్ళోకి పోనిమ్మన్నాడు. పెళ్ళిళ్ళు రిజస్టర్ చేసుకొనే కార్యాలయం ఎక్కడోనని, అడిగి తెలుసుకున్నారు.

"రిజస్ట్రీ ఆఫీసులోకి నడుద్దామా?" అని అడిగాడు అకిమోవ్. ఈ భావం కలిగినప్పుడు అతనికి యెంతో సంతోషం కలిగింది. కానీ "మనకు రిజస్టర్ పెళ్ళి ఎందుకు?" అని అనిచ్కా చెప్పిన సమాధానానికి అతను నివ్వెర పోయినాడు.

ఆవిడ కొంత పలుకు లేకుండా అయిపోయింది. ఆ కార్యాలయపు పేరు రాసివున్న ఎర్రబోర్డుసుచూస్తూ "సివిల్‌యాక్ట్స్ రిజస్ట్రీ ఆఫీసు".... "దీనికి ఈ పేరు ఎంత చప్పగా వుంది" అని పెదిమ విరిచింది.

వాళ్ళు ప్రవేశించిన ఆ కార్యాలయపు గది యెంతో చిన్నదిగా వున్నప్పటికీ, చక్కగా అలంకృతమై వుంది. అక్కడొక స్త్రీ కూర్చొని వుంది, యువతి అనిపించడంలేదు, జారు గౌను వేసుకుని వున్నది. అనిచ్కా ఆవిడను, ఇక్కడ మా పెళ్ళి రిజస్టర్ చేసుకొనే అధికారులు ఎవరన్నా వున్నారా అని అడిగితే "చేసుకోవాలనుకుంటె చేసుకోవచ్చు" అని కొంత కటువుగా, ఎబ్బెట్టుగా ప్రత్యుత్తర మిచ్చింది.

వివాహ వ్యవహార కృత్యాలు ముగియడంతోటే ఆవిడ, కనుబొమ లెగరేస్తూ, కొంత అవి, ఆవిడ కళ్ళు ఎరుపెక్కి వున్నాయి, వధూవరుల్ని అభినందించింది, దీర్ఘాయుష్మంతులుకమ్మని ఆశీర్వదించింది. ఆ ప్రక్కనుండి పోతూ వాళ్ళు చలనహీనమై స్తబ్దంగా వున్న మరో గదిని దాటారు. అక్కడ జననమరణాల రిజస్టరు చేసుకుంటారు. పెళ్ళిళ్ళకన్నా పుట్టుకలకన్న యుద్ధకాలంలో ఇవే యెక్కువ. ఒకగంట తర్వాత అకిమోవ్ వెళ్ళిపోయాడు.

....తిరిగి వస్తుండగా క్రాసింగ్ దగ్గర ఏమీ వొంట్లో బాగా లేనట్టనిపించింది; ఆమె ముఖం ఎంతో పాలిపోయి వుంది, కాగా బాగా చిరాకు పడుతున్నది. మొదట్లో ఆవిడ ఈ పరిస్థితిని అంతగా పట్టించుకోలేదు. ఆ నిర్లిప్త వైఖరికి కారణంగూడా లేకపోలేదు, మృత్యుభీతి అక్కడ అందరి మనస్సులనూ ఆవరించుక పోతున్నది. వేలాదిమందికి అదొక నిస్పృహ, విరక్తిని కలిగిస్తున్న, స్థితి. కీవ్ యుద్ధం తర్వాత, కొద్దికాలానికి తన పరిస్థితిని గురించి ఆందోళన పడడం మొదలు పెట్టింది.

చెప్పడానికే కష్టం, ఆవిడ యెంతో విహ్వల విచల మనస్కురాలై వుంది. కాగా ఆవిడకు అంత లౌక్యంకూడా తెలియదు, తన పరిస్థితి యెంతో అగమ్యగోచరంగా వుందని స్పష్టంగా తోచిందామెకు. అగమ్యగోచర మేమిటి, అసహ్యంగా వుంది. ఏదో ఒక పెద్ద రాక్షస కృత్యం జరిగినట్టు భావించుకుంటున్నది. అక్టోబర్ రైల్వే లైన్లో ఎక్కడో విసరేసినట్టున్న బొలొగోయి గ్రామంలో, తను ప్రేమించిన వ్యక్తితో అయిదురోజులు గడపడమేమిటి? ఆ రాత్రిళ్ళు మటుకు ఏమంత బాధ లేకుండా గడిచాయి? అవి తన గర్భంలో ఇంకో ప్రాణి అవిర్భవించడానికి ఎట్లా కారణమైనాయి? ఇట్లా పరిపరి విధాల ఆమె తన్ను తానే ప్రశ్నించుకొన్నది. ఒకొక్కప్పుడు కొంత నిర్లక్ష్యంగా, బిడ్డ పుట్టాక, నాద్యా అత్తయ్యదగ్గర వుంచి మళ్ళీ సైన్యంలోకి పోవాలనుకునేది. మరుక్షణంలో అదంతా కాదు, తన బిడ్డను ఇంకొకరి చేతుల్లో పెట్టి తను ఎట్లా ఊరుకుంటుంది? ఆ బిడ్డ పోషణ మాటేం కావాలి, వేళకుతిండీ, చదువూ అన్నీ ఎవరు తనంత శ్రద్ధగాచూస్తారు? అనుకునేది. "నా బిడ్డ", అమాటే పునశ్చరిస్తూ నాకు బిడ్డా అన్నట్టు తనలో తాను నవ్వుకునేది. ఆ సంఘటనను నమ్మలేకుండా వుంది. పరిమితంటూలేని, తన అమాయకత్వంలో తనకు ఒక బిడ్డంటూ కలగడం ఎట్లా సంభవ మవుతుందా అనే అనుమానంలో పడేది. సహ





జంగా ఆవిడ. పిల్లలు వివాహ జీవితం కొంతకాలంపాటు సుగమంగా గడిచాకనే పుడతారనుకునేది.

ఆవిడ, రోడ్డుమీద యుద్ధరంగానికి ఉద్విగ్నంగా పోతున్న జనాన్ని, గుంపులు గుంపులుగావున్న సైనికుల్నీ, బండ్లనూ చూచి తన ఆందోళనను కాస్త ఎమర్కొనగలిగింది. మనస్సును కాస్త వశంలోకి తెచ్చుకున్న తర్వాత కాస్త ఆ ఉద్విగ్నత తగ్గింది. తను చెయ్యవలసిన పనంతా చేసేసింది. అయినా తన చుట్టూవున్న మనుషుల్ని చూస్తున్నపుడు, ఆవిడవున్న ప్రత్యేక పరిస్థితిరో. వాళ్ళనుంచి తనను మాతృత్వం అనే చెరియలి కట్ట వేరుచేస్తున్నదనుకొన్నది ప్రవాహంలా వున్న ఆ ప్రజ అంతా ఆవిడకు ఎంతో దూరాన వున్నట్టనిపించింది. గత చరిత్రలా వాళ్లు ఎంతో దూరంలో వున్నారు. ఇప్పుడు ఆవిడను ఒక కొత్తదనం, ఇదివరకెన్నడూ కలగని మరో అభిరుచి పూర్తిగా ఆవహించింది. ఆమెలో రహస్యంగా చోటు చేసుకున్న ఆ కొత్తదనం, ఆ ఆకాంక్ష వల్ల ఆవిడ, అందరికన్న తాను విశాలమైన లక్ష్యాలు, ప్రముఖమైన ఆ వేదనలూ కలవారందరికన్నా అట్టడుగున వున్నాననుకొన్నది.

రాత్రిళ్ళు ఆమెకిచ్చిన డేరాలో పడుకున్నా, కుటీరంలో పడుకున్నా ఆవిడకు నిద్రపట్టేదికాదు. నిద్ర రాకపోవడం మూలాన యుద్ధాన్ని గురించి, విజయాన్ని గురించి సైనికులు చెప్పుకుంటుండే మాటలు వింటుండేది. అందరికి అత్యంత ప్రధానమైనవిగా కనుపించే ఆ విషయాలు, తనకు అంత ప్రధానమైనవిగా కనిపించక పోతుండడాన్ని, అవి ఆమెకు సుదూర విషయాలుగా వుండడాన్ని ఆవిడ సరిగ్గా గుర్తించినట్టయితే వలవల ఏడ్చివుండేది.

ఆవిడలో వచ్చిన ఈ వినూత్నతను, ఈ పరిణామాన్నిగురించి యెవరితోనన్నా చెప్పాలో, లేక పరిస్థితులు వాటంతటవే పక్వానికి వచ్చినప్పుడు బహిర్గత మవుతాయని ఊరుకోవాలో—ఏం చెయ్యాలన్న దానిని గురించి ఆవిడ ఒక నిర్ణయానికి రాలేదు.

ఆవిడను ఎక్కువగా కలవరపరచింది, తన గర్భంలో పెరుగుతున్న బిడ్డను గురించిన ఆందోళన, జాలి. అందుచేతనే ఆమె ఎటు కదలినా బహు జాగ్రత్త తీసుకొనేది, అడుగుతీసి అడుగు నింపాదిగా వేసేది. గుర్రంమీది స్వారీ చెయ్యడానికికూడా అంగీకరించేది కాదు. ఎప్పుడూ విలాసమంటే ఏమిటో ఎరుగని, ఆవిడలో వచ్చిన ఈ మార్పు అందర్నీ చకితం చేసింది.

కొర్రొస్తెజ యుద్ధ మధ్యాన మేజర్ గొలొవిన్ కాలుకు గాయం పడ్డది. ఆయన నివసిస్తున్న డేరాకు అనిచ్ఛా పరామర్శించాలని వెళ్ళింది, అక్కడ అయన ప్రక్కనే కూర్చుని క్షేమం తెలుసుకున్నది. మేజర్ అసుపత్రికి యుద్ధభూమిని విడిచి వెళ్ళనని చెప్పాడు. "మరి మీరిట్లా అంటే నేనేం చెయ్యాలి ?" అని ఎక్కెక్కి ఏడుస్తూ తన పరిస్థితిని పూసగుచ్చినట్టు చెప్పేసింది.

మేజర్ ఆవిడ పరిస్థితి, తన పరిస్థితికన్నా ఒక పెద్ద అవరోధంలా తోచింది. "మంచిది" "కాని" అంటూ "మనం ఇప్పుడు చెయ్యగలిగిందేమిటి ? ఏమిలేదు" అని కాస్త అలోచించ మొదలుపెట్టాడు. "అకిమోవ్ చిరునామాకూడా ఇప్పుడు మాదగ్గర లేదు, అదే గనక వుంటే ఆయన్ను అభినందిస్తూ ఒక తంతి పంపేవాడిని," అన్నాడు.

"అంతా అనుకోకుండా జరిగిపోయింది—హఠాత్తుగా" అంటూ ఆమె "ఇట్లా జరకూడదు" అన్న ముక్కలతో ముగించింది దీర్ఘంగా నిశ్వసిస్తూ.

"మనం ఇప్పుడు చేసేదేముందంటావు ?" అని సౌమనయంగా ప్రశ్నించాడు గొలొవిన్. తనే జవాబుగా "లేదు, ఏమీలేదు, చెయ్యను" అంటూ ఒకసారి ఆమెవంక సార్ద్ర దృక్కులతో చూచి, జరిగిన ఘటనను సమర్థించ మొదలుపెట్టాడు. "నువ్వెందుకు దాన్నిగురించి విభిన్నంగా ఆలోచిస్తావు. అందులో తప్పేముంది ? ఏదో హఠాత్తుగా కలుసుకున్న ఘటనక్రింద ఎట్లా తీసుకుంటావు ? అంతా బాగానే జరిగింది. నువ్వు చెయ్యవలసిందల్లా సేననుండి విడుదలగావడానికి ప్రయత్నించడం. ఆ తర్వాత మాస్కోకు వెళ్ళి మాతృత్వ విధ్యుక్తాన్ని నెరవేర్చుకోవాలి, ఇదేం స్వల్ప విషయంకాదు. అతి తీవ్రమైన సమస్యను యెదుర్కోవడంగా గుర్తించాలి. సరిగ్గా నువ్వు దాన్ని బాధ్యతాయుతమైన దృక్కోణంనుంచి చూస్తే, కామ్రేడ్ బెలొజ్యొరోవా, పిల్లల్ని కనడంకూడా ప్రభుత్వ బాధ్యతను నిర్వహించడ మంటావు. అందులోనూ అది గురుతర బాధ్యత" అంటూ ఉద్విగ్నంగా మాట్లాడుతున్నవాడల్లా ఒక్కక్షణం అగాడు. కాస్తాగి, గొంతు సవరించుకొని అన్నాడు: "నిజంగా జరిగినదానికి నాకు చాలా సంతోషంగా వుంది. నాకెప్పుడూ యుద్ధంలో నువ్వు యెక్కడ చంపివెయ్య బడ్తావోనన్న భయం వుంటుండేది. అట్లాంటి దురదృష్ట ఘటనేగనక జరిగితే అకిమోవ్‌కు ఏమని చెప్పగలిగేవాణ్ణి ?"

## ఫైర్మన్ స్మిర్నోవ్‌కు అధ్యక్షుడు వొరోషిలోవ్ దర్శనం

(8వ పుట తరువాయి)

"పిల్లవాడుగా వున్నప్పుడు నాకు గూడా అలానే ఎత్తైన స్థలాలంటే యేమీ భయం ఉండేదికాదు, పెద్దపెద్ద చెట్లను యెక్కేవాడ్ని. పిల్లలంటే అలానే ఉండాలి."

అటుతర్వాత అధ్యక్షుడు తన బాల్యాన్ని గురించీ, అంతర్యుద్ధ కాలంలో, అప్పుడే స్థాపితమైన సోవియట్ రిపబ్లిక్‌ను కాపాడడానికి శత్రువులతో పోరాడుతూ ఎర్ర సైనికులు చూపిన సాహసాన్నిగురించీ చెప్పారు. యుద్ధకాలంలో స్మిర్నోవ్ యెక్కడ ఉన్నదీ, అతనికి యేమేమి పతకాలు, బిరుదులు లభించినదీ అడిగి తెలుసుకొన్నారు, వొరోషిలోవ్. ఈ ఫైర్మెన్ యుద్ధంలో స్కౌట్‌గా పనిచేసిన విషయమూ, విముక్త ప్రాగ్‌లో యుద్ధం పూర్తిచేసిన విషయము తెలుసుకొని, "మీరు నిజంగానే గొప్ప సాహసవంతులు!" అన్నారు, వొరోషిలోవ్.

అటుతర్వాత వొరోషిలోవ్, స్మిర్నోవ్‌ను అతని పనిని గురించీ, కుటుంబాన్ని గురించీ అడిగి తెలుసుకున్నారు.

"మీకు పిల్లలేమైనా వున్నారా?"

"ముగ్గురున్నారు." అన్నారు స్మిర్నోవ్. ఆడపిల్లలిద్దరూ పాఠశాలలో చదువుతున్నారు. మగపిల్లవాడి వయస్సింకా మూడేళ్ళ."

"బాగున్నది, కామ్రేడ్ స్మిర్నోవ్!" అని వొరోషిలోవ్ వాక్యానించారు.

అధ్యక్షునికీ, ఫైర్మన్‌కూ మధ్య సంభాషణ ఒక అరగంట పాటు కొనసాగింది వాళ్ళిద్దరూ ఒకరినొకరు అభినందించుకొంటూ చేతులు కలిపి పట్టుకొనివుండగా ఛాయాచిత్రం తీయబడింది.

ఆ ఛాయాచిత్రాన్నిగూడా స్మిర్నోవ్ నాకు చూపించారు. తాను రక్షించిన వృద్ధురాలు, ఆమె మనుమడి ఛాయాచిత్రం, అతనిని అభినందిస్తూ దేశం నలుమూలలనుండి వచ్చిన ఉత్తరాలతోపాటు ఆ ఛాయాచిత్రాన్ని కలిపి ఉంచారు.

నూతన సంవత్సరాదికి ముందురోజు స్మిర్నోవ్‌కు అతనికి తెలియని వారనేకమంది దగ్గర్నుండి అభినందన లేఖలు వచ్చాయి. అదేరోజున తన విశాలమైన ఇంటిలో, అధ్యక్షుని అతిధిగా వున్నప్పుడు పొందిన ఆనందాన్ని ద్విగుణీకృతం చేసేట్టు ఒక విందును జరుపు కొన్నారు స్మిర్నోవ్.

## బాలోద్యానవనంలో ఒక రోజు

[18వ పేజీ తరువాయి]

ఈ ఆటసమయం తరవాత సంగీత పాఠం.

పిల్లలు కొత్త సంవత్సరం పండగకు తయారవుతున్నారు, కొత్త పాటలూ, నృత్యాలూ నేర్చుకుంటున్నారు.

ఐదుగంటలకు పిల్లలకు భోజనం వడ్డింపబడింది. తరవాత సుమారు ఆరున్నరకు తలిదండ్రులు వారిని తీసుకపోవడానికి రావడం మొదలుపెట్టారు. అక్కడ వుండిపోయిన వారికి బయట ఆడుకోవడానికి అనుమతింపబడింది.

నేనక్కడ సంతోషంగా ప్రొద్దుపుచ్చడానికి అవకాశమిచ్చినందుకు నటాలియా మిఖైలోవ్నాకు కృతజ్ఞత తెలిపి నేను, అజొయ్ యింటికి బయలుదేరాము.

## సముద్రగర్భంలోంచి [illegible] ప్రసారం

[21వ పేజీ తరువాయి]

లోకి ఒక బిందువు నీరు ప్రవేశించిందంటే చాలు, వెంటనే నౌకమీదనున్న ఒక ఎర్ర దీపం మిణుకుమిణుకు మంటుంది.

వెలుగు నీటిగుండా ప్రసారితమవుతుండన్నప్పటికీ, దానిలో కొంతభాగం నీటిచేత పీల్చుకొనబడుతుంది. నూరుమీటర్ల దళసరి నీటిగుండా వెలుగు ప్రసారమయిందంటే, అది దక్షిణాది తీవ్రమైన మధ్యాహ్నపు వెలుగు అయినాసరే, మసకమసక వెలుగుగా మారిపోతుంది. అందువల్ల అత్యంత తీవ్రమైన వెలుగును ప్రసారం చేసే బల్బులు అమర్చబడి వున్నాయి నీటిలోపల ఉపయోగించే టెలివిషన్లు ఇప్పుడు సముద్ర గర్భంలో విరివిగా ఉపయోగింపబడుతూ వున్నాయి. సముద్ర గర్భపు ప్రపంచంలోకి ఒక కవాటం తెరుపబడింది. నౌకలను నిర్మించేవారు, నూనె కార్మికులు, విద్యుత్ కార్మికులు, చేపలనుపట్టేవారు యీ కవాటంగుండా యెంతో ఉత్సుకతతో చూస్తున్నారు. నౌకలను బాగుచేయడం పనిలో, నీటి క్రింద పనిచేసే యీ టెలివిషన్ యంత్రాలు చాలా ఉపయోగపడుతాయి. ఈ పనికొరకు ఈ విద్యాసంస్థవారు స్వయంచోదిత టెలివిషన్ కెమేరాను తయారుచేసారు. దాని చక్రాలు—ఎలెక్ట్రో మ్యాగ్నెటిక్ తీగె చుట్టలు—లోహానికి కరుచుకొని ఉంటాయి. మోటారును నడుపగానే నీటిక్రోపలనున్న టెలివిషన్ పరికరాలు నౌక క్రింద ఈగలలాగ పాకుకొంటూ కదులుతాయి. నౌక అడుగుభాగంలో ఉన్న పొరపొట్లన్నీ టెలివిషన్ తెరమీద అగుపడుతాయి.

సముద్ర గర్భంలో పనిచెసే ఈ టెలివిషన్ యంత్రం మూలంగా, లోతైన సముద్ర ప్రాంతాల్లోకి దిగి పనిచేసేవారి పనిని సులభతరం చేయడానికి ఉపయోగపడే కొత్త యంత్రాలు తయారుచేయడం సుసాధ్యమవుతున్నది.

## సోవియట్‌దేశంలో కార్మికవివాదాలు ఏవిధంగా పరిష్కరింపబడుతాయి?

[28వ పుట తరువాయి]

గంటలు ఆలశ్యంవచ్చాడు. దానికి తగు కారణము చూపలేకపోయాడు. అతడు ఆలశ్యంగా రావడం మూలాన ఆదళం అంతటి పని పాడయ్యింది.

అందువల్ల అతడు బర్తరఫ్ చేయబడ్డాడు. తనను బర్తరఫ్ చేయడం సరియైన చర్యకాదని అతడు కార్మిక వివాదాల కమీషన్‌కు, అటుతర్వాత యంత్రాగార కార్మిక సంఘం యొక్క కమిటీకి దరఖాస్తులు పెట్టుకున్నాడు. కార్మిక సంఘం యొక్క కమిటీ అతనిని తిరిగి పనిలోకి తీసుకొడానికి నిరాకరించింది. అప్పుడా కార్మికుడు ప్రజాకోర్టుకు అపీలు చేసుకున్నాడు. కోర్టులో విచారణ జరుగుతున్న సమయంలో క్రమశిక్షణ విషయంలో ఉపేక్షాభావం వహించినట్లు అంగీకరిస్తూనే అతడు, తనకు తన పని అంటేను, తన యంత్రాగారం అంటేను చాలా ఇష్టమని వెల్లడించాడు. తాను ఇక ముందు క్రమశిక్షణకు గట్టిగా కట్టుబడి శ్రద్ధతో పని చేస్తానని వాగ్దానం చేస్తూ తనను పనిలోనికి తీసుకొనమని కోరాడు.

కోర్టువారు నిర్ణయాన్ని చెబుతూ, యంత్రాగారం నిర్వాహకులు ఈకార్మికుని విషయంలో తగు విద్యాబోధనను చేసి, నచ్చజెప్పలేదని తెలియజేసారు. యంత్రాగార నిర్వాహకులు వినియోగించవలసిన పద్ధతులన్నీ వినియోగింపబడలేదు. ఈ దిగువ క్రమంలో ఆ పద్ధతులు వినియోగింపబడాలి: మందలించాలి, హెచ్చరించాలి, తీవ్రంగా హెచ్చరించాలి, మూడు నెలల వరకు తక్కువ వేతనం వచ్చే ఉద్యోగంలోకి తగ్గించివేయాలి. ఆటుతర్వాత చివరి చర్యగా బర్తరఫ్ చేయాలి. ఈ సందర్భంలో, నిర్వాహకులు తొందరపడి, మరీ తీవ్రమైన కేసులలో మాత్రమే తీసుకోడానికి కార్మిక చట్టం అనుమతిస్తున్న చర్యను తీసుకున్నది. కోర్టువారు, ఆ కార్మికుడు మనఃపూర్వకంగా తన పొరపాటును ఒప్పుకొని, బాగా పనిచేయడానికి వాగ్దానం చేస్తున్న విషయాన్ని గమనికలోనికి తీసుకొని, అతనిని తిరిగి ఉద్యోగంలోనికి తీసుకోవలసినదిగా తీర్పు చెప్పారు.

సోవియట్ దేశంలో కార్మిక వివాదాల పరిష్కారంచేసే పద్ధతులలో శ్రామిక ప్రజల ప్రయోజనాల పరిరక్షణే పునాదిరాయిగా వుంటుంది.

# డున్నో, అతని మిత్రులు చేసిన సాహసకృత్యాలు



ఎన్. నోసోవ్

## పూల నగరపు తవ్వటి పురుగులు

అనగనగా దేవతాలోకపు నగరం ఒక దానిలో తవుటి పురుగులన్న పేరుతో కొందరు మనుష్యులుంటుండేవాళ్లు. వాళ్ళు పిసరంత వుండేవారు గాబట్టి వాళ్ళని అందరూ తవుటి పురుగులని పిలచేవారు. వాళ్ల నగరం బహు అందంగా వుండేది. ఒక చిన్న ఏటిగట్టున వుండేదా నగరం. ఆ ఏటి గట్లమీద ఎన్నో దోసకాయలు పండేవి కాబట్టి, ఆ ఏటిని తవుటి పురుగులు దోస కాయ ఏరని పిలచేవారు.

ఏటికి అవతలి ఒడ్డున ఒక అడవి వుండేది. బిర్చ్ చెట్ల బెరడులతో తవుటి పురుగులు తెప్పలు తయారు చేసుకుని, వాట్లలో ఆ ఏటిని దాటేవాళ్ళు, అడవిలో కాయలూ, బెర్రీపళ్ళూ, పుట్టగొడుగులూ ఏరుకునేందుకు. బెర్రీపళ్లను ఏరుకోవడం తవుటి పురుగులకు, చాలా కష్టంగావుండేది. వాళ్లు పిసరంతమాత్రమే వున్నారు గాబట్టి. కాయలు కోసుకోవడానికి వాళ్ళు పొదల పైకి ఎక్కి, చేతితో కాయలు కోసుకో లేరు గాబట్టి, తమతో రంపాలు తీసుక వెళ్ళవలసి వచ్చేది. వాళ్ళు పుట్టగొడుగు లను కూడా రంపాలతో కోయవలసివచ్చేది. వాటిని నేలకు అంట వాటిని కోసి, తరవాత వాటిని ముక్కముక్కలుగా కోసి, వాటిని దూలాలు మోసినట్టుగా యింటికి మోసుక వెళ్ళేవాళ్ళు.

నీలపు గంట వీధిలోని ఒక యింట్లో పదహారుగురు తవుటి పురుగు మొగపిల్ల లుండేవాళ్లు. వాళ్లందరిలోకి డూనో ముఖ్యమైనవాడు. అతనికి సర్వమూ తెలుసును గాబట్టి డూనో అన్న పేరు అతనికి వచ్చి నది: ఎప్పుడూ పుస్తకాలు చదువుతూ వుంటాడు గాబట్టి అతనికి సర్వమూ తెలిసి పోయింది. అతని టేబిలుమీదా, టేబులు క్రిందా, పక్కమీదా, పక్కకింద పుస్తకాలే. పుస్తకంలేని జాగా అతని గదిలో మీకు కనుపించదు. ఈ పుస్తకాల ద్వారా అతను నానారకాల విషయాలూ తెలుసుకున్నాడు. అంచాత అందరూ అతనిని మెచ్చుకుంటారు, అతను చెప్పినదల్లా చేస్తారు. అతను ఎల్లప్పుడూ నల్లబట్టలు వేసుకుంటాడు. అతను తన వ్రాతబల్లవద్ద కళ్ళద్దాలు పెట్టుకు కూచుని పుస్తకం చదవడం మొదలుపెట్టేటప్పుడు, అతను పెద్ద ప్రొఫెసరులాగా ప్రపంచం అంతా కలయ జూస్తాడు.

వీళ్ళుగాక దెబ్బ అన్న పేరింటివాడు ఒక వేటగాడున్నాడు. అతనికొక కుక్క వుంది. దానికి చుక్క అని పేరుపెట్టాడు. అతనికొక తుపాకీవుంది. అది కార్కులను కొడుతుంది. బ్లోట్స్ అన్న ఒక చిత్రకారుడు, త్రిల్స్ అన్న గాయకుడు కూడా వున్నారు. తక్కినవాళ్ళ పేర్లు స్విఫ్టీ, గ్రుంప్స్, మమ్స్, రోలీ-పోలీ, స్కాటర్ బ్రెయిన్; ప్రాప్స్, ప్రోబ్లీ అన్న యిద్దరు అన్నదమ్ములూ, కాని వీళ్ళందర్లోకి ఎక్కువ ప్రసిద్ధిగలవాడు డున్నో అన్న తవుటి పురుగు. ప్రతి ఒక్కటీ అతనికి తెలియదు గాబట్టి—వాస్తవానికి అతనికి యేదీ తెలియదు—డున్నో అన్న పేరు వచ్చింది.

డున్నోకు గుంకీ అన్న స్నేహితు డున్నాడు. అతనూ, డున్నో గంటల తరబడిని కూచొని మాటాడు కుంటారు. వాళ్ళు రోజుకు యిరవైసార్లు పోట్లాడుతుంటారు, కాని వాళ్లు మళ్లీ కలసిపోయేవాళ్ళు.

## డున్నో సంగీత సాధన

డున్నో ఏఒక్కపనీ సరిగా చేయలేడు. కూడబలుక్కోవడాన్ని మించి అతనికి

























చదువు రాలేదు. అచ్చులో వున్నట్టుగా మాత్రమే అక్షరాలు విడివిడిగా వ్రాయ గలడు. కొందరు వాడిది మట్టిబుర్ర అన్నారు కాని అది నిజంకాదు. అది మట్టి బుర్ర అయితే అతను అసలు ఆలోచించలేక పోయేవాడు గదా. నిజానికి అతను ఎక్కువగా ఆలోచించేవాడు కాదు; కాని అతను జోళ్ళు కాళ్ళకు తొడుక్కునేవాడు గాని తలమీద పెట్టుకునేవాడుకాదు. ఆ మాత్రం చేయడానికి కూడా కొంత ఆలోచించాలి గదా.

అయినా అతను చెడ్డవాడేమీకాదు. అతనికి చదువుకోవాలని వుంది, కాని పని చెయ్యాలని లేదు. ప్రయత్నం చేయకుండా అతనికి చదువుకోవాలని వుంది. కాని తవుటి పురుగుల్లో అతి తెలివైనవాళ్ళు కూడా అలా నేర్చుకోలేరు.

తవుటి పురుగు మొగపిల్లలకూ, తవుటి పురుగు ఆడపిల్లలకూ సంగీతం అంటే ఎంతో యిష్టం. త్రిల్స్ చాలామంచి గాయకుడు. అతను బాగా వాద్యాలు వాయిస్తాడు గాబట్టి అతనిని అందరూ మెచ్చుకునేవారు. ఇందువల్ల డున్నోకు అసూయ కలిగింది. ఒకరోజు అతను త్రిల్స్‌ను ఇలా అడిగాడు :

"సంగీతం వాయించడం నాకు నేర్పించు. నాకు కూడా గాయకుడ్నవుదామనుంది."

"బాగుంది. నీకు ఏవాద్యం వాయించాలనుంది" అన్నాడు త్రిల్స్.

"అన్నిటికంటె తేలికగా వచ్చేదేది ?"

"బాంజో".

"అది నాకియ్యి. నేను ప్రయత్నిస్తాను."

త్రిల్స్ అతనికి ఒక బాంజో యిచ్చాడు. డున్నో దానిని కాస్త వాయించి, యిలా అన్నాడు :

"ఇది యెక్కువగా రొద చేయదు. ఎక్కువ రొద చేసేదానినియ్యి."

త్రిల్స్ అతనికి ఒక ఫిడేలు నిచ్చాడు. డున్నో దానికి కాస్సేపు వాయించి యిలా అన్నాడు :

"ఇంతకంటె యెక్కువ రొద చేసేదేదీ నీ దగ్గర్లేదూ ?"

"నాదగ్గర కొమ్ము వుంది" అన్నాడు త్రిల్స్.

"అది చూడనీ"

త్రిల్స్ అతనికి ఒకపెద్ద యిత్తడి కొమ్ము నిచ్చాడు. డున్నో దానిని చేతనైనంత గట్టిగా ఊదాడు. అది కర్ణకఠోరమైన శబ్దం చేసింది.

ఊ-ఊ-ఊ-మ్! బొ-అ-అ-మ్!

"నువ్వు ఊరికే ఊదుతున్నావు, వాయించడంలేదు" అన్నాడు త్రిల్స్.

"వాయించడం లేదూ ?" అన్నాడు డున్నో కటువుగా. "నేను చాలా బాగా వాయిస్తున్నాను, నేను పెద్దగా రొద చేస్తున్నాను."

"నీకు కావలిసింది రొద చేయడంకాదు, సంగీతం వాయించడం."

"ఇదే సంగీతం."

ఆ సాయంత్రం, అందరూ ఇంట్లో వున్నప్పుడు డున్నో కొమ్మును తీసి. మళ్ళీ దానిని ఊదడం మొదలు పెట్టాడు.

బూమ్-బూమ్-బూమ్-బూమ్!

"ఏమిటా గోల ?" అని అరిచారు వాళ్లు

"ఇక్కణ్నుంచి బయటికి పో, నీ పాడు కొమ్ము పట్టుకొని!"

"నే నెక్కడికి పోతాను ?"

"పొలాల్లోకిపోయి, అక్కడ వాయించుకో."

"అక్కడ వాయిస్తే, ఎవ్వరికీ వినిపించదు"

"అయితే యింటవతలకెళ్ళి, యిరుగు పొరుగు వాళ్ళకు వాయించి వినిపించు."

డున్నో బయటికెళ్ళి, పొరుగువాళ్ళ యింటి కెదురుగుండా వాయించడం మొదలు పెట్టాడు. పొరుగువాళ్ళు బయటికొచ్చి గోల చెయ్యొద్దన్నారు. అతను యింకో యింటి కెళ్ళాడు, కాని అక్కణ్నుంచికూడా పొమ్మన్నారు. మూడోయింటి దగ్గరకూడా యిదే జరిగింది. పగతీర్చుకోవడానికి అతను బలమంతా ఉపయోగించి ఊదాడు. ఇది విని అందరూ కోపం పట్టలేకపోయారు. వాళ్లు ఇళ్ళల్లోంచి పరుగెత్తుకువచ్చి, అతడ్ని తరిమి వేశారు, తనకొమ్ముతో వాళ్ళ బారినుండి తప్పించుకోవడానికిఅతను చేయగలిగిందల్లా యిదే.

ఆ తరవాత అతను దానిని ఊదలేదు.

"నా సంగీతం ఎవ్వరూ మెచ్చుకోవడం లేదు" అన్నాడతను. "వాళ్ళలో యింకా రసజ్ఞత రాలేదు. వాళ్ళు రసజ్ఞులయ్యాక, వాళ్ళే విందామని కోరతారు. కాని అది ఎప్పుడో జరిగే విషయం. నేనప్పుడు వాయించనే వాయించను."

(సశేషం)



# నేపాల్ లో సోవియట్ రాయబారి

నేపాల్‌లో ప్రథమ సోవియట్ రాయబారిగా వ్యవహరించుటకు సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల సమాఖ్య ప్రభుత్వంచే నియమితులైన భారతదేశంలోని సోవియట్ రాయబారి ఎమ్. ఎ. మెన్షికోవ్ మార్చి 8వ తేదీన నేపాల్‌కు వెళ్ళి నేపాల్ మహారాజుకు తన సాధికార పత్రాలను 1957 మార్చి 10వ తేదీన సమర్పించారు

సోవియట్ దేశం, నేపాల్‌ల మధ్య దౌత్య సంబంధాల స్థాపన, సోవియట్, నేపాల్ దేశాల ప్రజలమధ్య పలువిధాల మిత్ర సహకారాభివృద్ధికి ప్రారంభాన్ని సూచిస్తుంది. అన్ని దేశాలతో స్నేహ సంబంధాలను స్థాపించుకోవాలని కాంక్షించే సోవియట్ దేశం నేపాల్‌తో దౌత్య సంబంధాలను స్థాపించుకొనడం ద్వారా, ఈ ఉభయదేశాల ప్రజలమధ్య సాంస్కృతిక, ఆర్థిక సంబంధాల అభివృద్ధికి అవకాశాలను కల్పించడమేగాక, శాంతి ఆశయాన్ని బలపర్చింది. యోగ్యతాపత్రాలను సమర్పిస్తూ, తమ ప్రసంగంలో ఎమ్. ఎ. మెన్షికోవ్ ఇలా ఉద్ఘాటించారు: "సోవియట్ దేశ విదేశాంగ విధానం యొక్క ప్రాథమిక సూత్రాలు, శాంతియుత సహజీవన సూత్రాలు. ఇతరదేశాలతో సంబంధాల విషయంలో సోవియట్ దేశం, ఆ దేశాలు పెద్దవా, లేక చిన్నవా అన్న ప్రమేయంలేకుండా, ఇతరదేశాల సర్వసత్తాధికారాల పట్ల గౌరవం, అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకొనకపోవడం, సమానత్వం, పరస్పర లాభం అన్న సూత్రాలను అంటిపెట్టుకొని వుంటుంది ఈ ప్రాతిపదికపైన సోవియట్ దేశం, నేపాలు రాజ్యాల మధ్య సంబంధాలు పెంపొందగలవని నేను గట్టిగా నమ్ముతున్నాను సోవియట్ దేశం, నేపాల్‌ల ప్రజల ప్రయోజనార్థం, యావత్ప్రపంచంలో శాంతి ప్రయోజనాల పరిపోషణార్థం, ఉభయదేశాల మధ్య మైత్రిని పటిష్ఠం చేసుకొని ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలను విస్తరింపజేసుకొనడానికి సోవియట్ ప్రభుత్వము, ప్రజలు ఆకాంక్షిస్తున్నారు"

నేపాల్ ప్రభుత్వము, ప్రజలు సోవియట్ రాయబారికి హృదయపూర్వకంగా స్వాగతమిచ్చారు. మార్చి 10, 11 వ తేదీలలో నేపాల్ విదేశాంగ మంత్రి, నేపాల్-రష్యా మిత్రతా సంఘంవారు సోవియట్ దేశ రాయబారికి గౌరవార్థం జరిపిన విందులూ, నేపాల్ మహారాజు, రాణి ప్రధాని శ్రీ ఆచార్య హాజరైనట్టి మార్చి 11వ తేదీన ఎమ్. ఎ. మెన్షికోవ్ జరిపిన విందు కూడా ఈ విషయాన్నే రుజువు చేస్తున్నాయి.

నేపాల్‌కు సోవియట్ రాయబారి యం. ఎ. మెన్షికోవ్, నేపాల్ మహారాజుకు సాధికార పత్రాన్ని సమర్పిస్తున్నారు.





నేపాల్, సోవియట్ దేశాల జాతీయ గీతాల గానం చేయబడుతోంటే యం. ఎ. మెన్షికోవ్ వందనం చేస్తున్నారు.

ఈ విందు లన్నింటిలోను సోవియట్ ప్రజల పట్ల ప్రగాఢమైన స్నేహభావాలు ప్రకటింపబడ్డాయి. ఈ సందర్భంలో "ఎవరెస్ట్ న్యూస్" అను పత్రిక సంపాదకీయంలో ఇలా వ్రాసింది: "ప్రథమ సోవియట్ రాయబారి అయిన శ్రీ మెన్షికోవ్‌కు స్వాగతమివ్వడానికి మేము ఎంతయూ ఆనందిస్తున్నాము....రష్యా రాయబారి యొక్క మొట్టమొదటి రాక ఉభయదేశాల మధ్య ఆర్థిక, రాజకీయ రంగాలలో స్నేహాన్ని, సహకారాన్ని మరింతగా పెంపొందించడానికి ఒక నూతన శకాన్ని ఆరంభించగలదని మేము ఆశిస్తున్నాము"

సోవియట్ ప్రభుత్వము, ప్రజలు తమపట్ల నేపాల్ ప్రదర్శించిన ప్రగాఢమైత్రీ భావాన్నే నేపాల్ ప్రజల పట్ల తిరుగ ప్రదర్శిస్తారనీ, నేపాల్‌తో సంబంధాల స్థాపనను హర్షించి, ఒకరిదేశంలో మరొకరు పర్యటించుటద్వారా పరస్పరం అర్థం చేసుకొని ఉభయదేశాల ప్రజలు తమ మైత్రిని పటిష్ఠం చేసుకొంటారనీ వేరే చెప్పనవసరం లేదు. 1957 మార్చి 14వ తేదీన నేపాల్ రేడియోలో ప్రసంగించిన ఎమ్. ఎ. మెన్షికోవ్ ప్రసంగంలో ఇదే ప్రతిబింబించింది: "సమీప భవిష్యత్తులో నేపాల్ సంస్కృతి, కళలకు సంబంధించిన ప్రతినిధులు సోవియట్ దేశాన్ని సందర్శించగలరని నేను ఆశిస్తున్నాను. అదేవిధంగా, సోవియట్ సంస్కృతి, కళలకు సంబంధించిన ప్రతినిధులు సుందరమైన మీ దేశాన్ని సందర్శించడానికి గూడా కుతూహల పడుతారు."

## జయశంకర్ ప్రసాద్ సంస్మరణ: వైజ్ఞానిక సమావేశం

(27వ పుట తరువాయి)

"ప్రసాద్ రచనలు యింకా గొప్పగా ప్రజల ఆదరణను పొందుతూ వున్నాయి. అవి తమ భావనా పటిమవల్లనూ, నిండుతనం వల్లనూ ప్రజలపైని గొప్పగా తమ ప్రభావాన్ని వెదజల్లుతున్నాయి" అంటూ బి. సహానీ ముగించారు.

రేడియో సమాచార సంఘంలో పనిచేసే శ్రీమతి మోహినీ రావు, జయశంకర్ ప్రసాద్ రచనలలోని స్త్రీ పాత్రలగురించి ప్రసంగించారు. ఆయన రచనలలోని "మాళవిక", "దేవసేన" మున్నగు స్త్రీ పాత్రలలో భారతీయ మహిళల ఉత్తమోత్తమ గుణాలు, విధి నిర్వహణ, న్యాయవంతమైన ఒక ఆశయం గెలుపొందడానికి జీవితార్పణ చేయడానికి వారి సంసిద్ధత కనిపిస్తాయని ఆమె తెలియజేశారు.

భారతీయ ప్రజల భాషాశాస్త్ర, సారస్వతశాఖ సభ్యులు "భారత స్వాతంత్ర్య పోరాటం; దాని జాతీయ సంస్కృతీ పునరుజ్జీవనమూ, జయశంకర్ ప్రసాద్ కృషి" గురించి చేసిన ప్రసంగాలు, హిందీ సారస్వతాభివృద్ధిలో ప్రసాద్ నిర్వహించిన గొప్ప పాత్రను వివరించాయి.

జయశంకర్ ప్రసాద్ కృషికి అంకితమైన వైజ్ఞానికసమావేశం, సోవియట్ భారతీయ విద్యాధ్యయన వేత్తలకు గొప్ప ఆసక్తిని కలుగజేసింది. భారతీయ భాషలను బోధించే పలువురు ఉపాధ్యాయులూ, పై తరగతుల విద్యార్థులూ, పోస్టు గ్రాడ్యుయేట్లు, అనువాదకులూ ఈ సభకు హాజరయ్యారు.

## 1957లో ఆసియా

(20వ పుట తరువాయి)

చెప్పడానికి, ఎవ్వరూ ప్రవక్త కానక్కరలేదు. ఆసియాలో అపూర్వమైన సాంస్కృతిక అభివృద్ధిని ఆశించడానికి మనందరికీ హక్కుంది కూడా. ఇందుకు నిర్ణయాత్మకమైన ఏకైక అవశ్యకం—శాంతి.

శాశ్వత శాంతి స్థాపనకు ఆసియాలోని సార్వభౌమదేశాలు యింతగా శ్రద్ధవహించడమూ, యింత గొప్పగా కృషిచేయడమూ చాలా సహజ విషయం. అంతర్జాతీయ సంబంధాలకు చెందిన పంచసూత్రాలైన—శాంతిని పటిష్ఠం చేయడమూ, దేశాల శాంతియుత సహకారమూ వీటి ముఖ్యలక్ష్యం—"పంచశీల"లకు ఆసియా జన్మకారణం కావడం యాదృచ్ఛికమేమీ కాదు.

"పంచసూత్రాల" నైతిక శక్తి కాదనడానికి వీలులేనిది. ఆసియా సరిహద్దులకు చాలా అవలకూడా అవి గుర్తింపబడుతున్నాయి. ఇంకా అవసరమైన విషయమేమిటంటే, శాంతి శత్రువులందరినీ, వలసవ్యవస్థను బలపర్చినవారినందరినీ—వారెంతగా మారువేషాలు వేసుకున్నప్పటికీ—"పంచశీలాలు" పూర్తిగా ప్రకటనాత్మకమైన మాటలు మాత్రమే కావన్న సత్యాన్ని స్పష్టంగా గుర్తించేటట్టుగా చేయడం. శాంతిని రక్షించడానికీ, అందుకు వారికిగల నిజమైన అవకాశాన్నీ కోటానుకోట్ల మంది ప్రజల కేంద్రీకృత దీక్షను ప్రతిబింబిస్తాయి, "పంచశీలాలు".

బాండుంగ్ ఉజ్వల భావాలచే ఉత్తేజితమైన నవ ఆసియా 1957లో పురోగమనాన్ని సాగిస్తూ సాగిపోతుందన్న విషయాన్ని ఎవ్వరూ సందేహించలేరు.

తమ యిరుగు పొరుగు దేశాలైన ఆసియాదేశాల పునరుజ్జీవన, పురోభివృద్ధి క్రమాన్ని, సోవియట్ ప్రజలు నిండు హృదయంతో, మనఃపూర్వకానందంతో గమనిస్తున్నారు. సోవియట్ దేశమూ, యితర సోషలిస్టు దేశాలూ తమకు విశ్వాసపాత్రులైన, స్వార్థరహితులైన దేశాలుగా సర్వదా ఉండగలవని, యీ దేశాలు దృఢ విశ్వాసంతో ఉండవచ్చును.

## "రోమెన్"—సోవియట్ జిప్సీ నాటకశాల

(32 వ పుట తరువాయి)

పొందుతున్నది. నూతనంగా యేర్పాటు చేయబడిన జిప్సీ సమిష్టి వ్యవసాయ క్షేత్రాల నుండి వచ్చినవారు ఈ పాఠశాలలో ప్రత్యేక శిక్షణను పొందుతూ వుంటారు. ఈ పాఠశాలలో విద్యనభ్యసించే శ్రామిక యువకులకు, శిక్షణ పూర్తి అయిన తర్వాత పరీక్షలు జరుపబడుతాయి. మా నటకులలో ఇద్దరు, ఫ్యోదర్ బిజేవ్, సంతీనా అంద్రియేవాలు, ఇటువంటి పరీక్షలలో ఉత్తీర్ణులై ఇప్పుడు సహాయ నిర్మాతలుగా పని చేస్తున్నారు.

ఓల్గా పెత్రోవా, ఓల్గా యాంకోవ్స్కయాలు పదిహేను సంవత్సరాల క్రితం నాటకసమాజంలోకి వచ్చినప్పుడు పూర్తిగా నిరక్షరాస్యులు. పెత్రోవా తలిదండ్రులు సంచార జీవితానికి స్వస్తి చెప్పి మాస్కో పొలిమేర్లలో స్థిరపడిన తర్వాత, ఆమె తండ్రి గుర్రాలశాలలో పనివాడుగా చేరాడు. ఆమె ఒక జవుళీ మిల్లులో సహాయకురాలుగా చేరింది. కాని ఆ పని ఆమెకు విసుగును పుట్టించేది. శ్రద్ధగా పనిచేస్తూ వచ్చినప్పటికీ, విరామ సమయాల్లో నృత్య, గానాలతో గడుపకుండా ఉండలేక పోయేది. ఇలా వుండగా ఒక పర్యాయం ఆమె రోమెన్ నాటక సమాజంయొక్క నాటకాన్ని చూడడం తటస్థించింది. తనకు తృప్తిని కలిగించగలది నాటకరంగం తప్ప మరేదీలేదని గ్రహించింది. నాటక సమాజ నిర్వాహకులు, ఆమె మొట్టమొదటి పర్యాయంగా తమను కలసికొన్నప్పుడు ఆమె కోర్కెను అంగీకరించకుండా ఉండలేక పోయారు. ఇప్పుడు ఓల్గా పెత్రోవా, ఈ నాటక సమాజంలో ప్రముఖ నటులలో ఒకర్తెగా వుంటున్నది. చలన చిత్రాలలోగూడా ఆమె నటిస్తున్నది. ఇప్పుడు ఆమె "డాన్ క్విక్సోట్" (సెర్వాంటెస్ రచన) అను చిత్రంలో నటిస్తున్నది. ఈ చిత్రంలో నటిస్తున్న ఇతర నటీనటులందరుకూడా రోమెన్ నాటక సమాజం వారే.

ఓల్గా యాన్కోవ్స్కయా జీవితంగూడా చాలా ఆసక్తిజనకంగా వుంటుంది. జిప్సీ నాటక సమాజానికి దరఖాస్తు పెట్టుకొనేటప్పటికి ఆమె వయస్సు పదమూడు సంవత్సరాలే. సహజంగానే, చిన్న వయస్సుదని ఆమె దరఖాస్తు నిరాకరింప బడింది. కాని అంతటితో ఆమె అధైర్య పడలేదు. కొద్దిరోజుల తర్వాత ఎత్తు మడమల బూట్లు వేసుకొని పెద్దదానిలాగా దుస్తులు ధరించి, మళ్ళీ నాటక సమాజానికి వచ్చింది. నాటక రంగంపైన పనిచేయగల ఈడు ఇంకా రాలేదని ఆమెకు నచ్చచెప్పడానికి, నాటక సమాజం డైరెక్టరు ఒక పాత్రను అభినయించమని ఆమెను కోరాడు. కాని ఆమె ఆ పాత్రను అత్యంత అద్భుతంగా నటించింది. అసాధారణమైన ప్రతిభ ఆమెలో వున్నదని గ్రహించి వారు ఆమెను తమ నాటక సమాజంలోకి తీసుకొనవలసి వచ్చింది.

నికొలాయ్ స్లిచెంకో ఈ నాటక సమాజంలో చేరడానికిముందు ఒక జిప్సీ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో కమ్మరి పని చేస్తుండేవాడు. ఇప్పుడు అత్యంత ప్రతిభావంతులయిన నటులలో అతడొకడుగా పరిగణింప బడుతున్నాడు. అందగాడు, యువకుడు అయిన ఈ నటుడు ప్రేక్షకుల హృదయాలను చూరగొన్నాడు.

రోమెన్ నాటక సమాజము విదేశాలలోగూడా గొప్ప కీర్తిని గడించుకొన్నది. పాతిక సంవత్సరాలుగా నాటకాల ప్రదర్శనలో విశిష్ట కృషిని జరుపుతున్న ఈ నాటక సమాజాన్ని అభినందిస్తూ విదేశాలనుండి అనేక లేఖలు ప్రతి రోజు వస్తూ వుంటాయి.

# విషయసూచిక



ముఖచిత్రం : భారతీయుడు అజోయ్‌రాయ్,
అతని రష్యన్ స్నేహితురాలు లెనా రుదాకోవా.

రెండవ అట్ట : జయశంకర ప్రసాద్

వెనుక అట్ట : పూతపట్టిన ఆపిల్ కొమ్మ.
(ఛాయాచిత్రం: ఎ. స్తనొవోవ్)




భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు : పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లి.

